

"జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ" చిత్రకారుడు: సి. ఎ. రామచంద్రన్.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 32
13.4-55

మన్మథ చైత్ర బహుళ షష్ఠి బుధవారం



దేశోద్ధారక వర్ధంతినాడు కర్నూలు ఆంధ్ర పత్రిక కార్యాలయమందు జరిగిన సభలో పాల్గొన్న మంత్రులు కళా వెంకట్రావు, సంజీవయ్య, చంద్రమౌళి మొదలైనవారు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : సారథిచిత్రం "రోజులు మారాయి"లో నర్తకి వహీదా రెహమాన్

కాంబోడియా కబుర్లు— 3
దొంగా...లింగమూర్తి— 5
అపస్వరాలు (సీరియల్)— 14
జీవాణం చేరిపేట— 19
సీతాపహరణం— 23
వనితాలోకం— 30
తిరుగుబాటు— 32
బొమ్మరిల్లు— 36
టీ కప్పులో తుపాను— 37
జాదరి— 45
విజ్ఞానవీధులు— 49
సినిమా— 50

# ఈ ప్రసిద్ధిగాంచిన క్రీములు మీ చర్మమునకు సరిగా అనువైనవి

**మీ పరిసరాల శీతోష్ణస్థితికి తగినవి:**

అద్భుతమైన యీ రెండు పాండ్స్ సౌందర్య సాధనలు వాడండి. అవి మీ చర్మమునకు సరిగా అనువైనవి. ఈ రెండూ శీతోష్ణస్థితుల బాధల నుండి మీ ముఖమునకు రక్షణ నిచ్చి, మీ చర్మమును నిర్మలముగ మరియు మృదువుగ ఉంచును.




పొడిగాలిగల శీతోష్ణస్థితి మీ ముఖ కాంతిని పాడుచేయు నప్పుడు — పాండ్స్ కోల్డ్ క్రీమ్ మీకు అవసరము. దానిలో నున్న విశేష నూనెలు చర్మమునకు ఉపశమనము నిచ్చి తీక్షణమైన ఎండ, వడగాడ్పులతో అది వాడిపోకుండా కాపాడును.




మీ చర్మము సహజముగ జిడ్డుగాయుంటే లేక వేడి వెమ్మగల గాలిలో జిడ్డుగా అవుతూ ఉంటే — పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి. ఎంతో తేలికగా మరియు మంచువలె నున్న ఈ క్రీమ్ రోమరంధ్రాలను అడ్డిన జిగటను, విస్తీర్ణమైన రక్తకణములకు అడ్డము తీసి, మీ ముఖమునకు సౌమ్య రక్షణ నిచ్చును.

పాండ్స్ క్రీమును ప్రతిదినము తప్పక వాడండి. కొన్ని రోజులలో మీ చర్మము ఎంతో మనోహరముగ, నవనవలాడేలా ఉండుట మీరు చూడగలరు — అనుభవించగలరు కూడ!



## ప్రపంచములో సౌందర్యరాణులు వాడే క్రీములు




## పాండ్స కోల్డ్ క్రీమ్ / వ్యానిషింగ్ క్రీమ్

P. 867.

# కాంబోడియా కబుర్లు : 9

# ★ వొస్సా ★

ఆషాఢ బ॥ పాడ్యమి లగాయతు మూడు నెలలు బుద్ధ భిక్షువులు పెగోడాల్లోనే ఉండిపోవాలి గాని, ఊరమ్మట పర్యటించడానికి వీల్లేదని ఓ నియమం. ఈ మూణ్ణెల్లూ "వొస్సా" అంటారు. ఈమాట పాళీభాషలో "వస్సా", సంస్కృతంలో వర్షంన్నా. (వర్షాకాలం ప్రయాణానికి అనుకూలంగా ఉండదు గనక యీ ఆచారం వెలిసి ఉంటుంది.) బుద్ధుడే యీ నియమం చేసేడని అంటారు. ఆషాఢ, శ్రావణ, భాద్రపదాలు వర్షపు రోజులు కాంబోడియాలో.

ఈ మూణ్ణెల్లూ ప్రతీ పెగోడాలోనూ "వొస్సా దివ్వె" వెలిగించాలి. దీనిమట్టూ, స్టాండూ కఱ్ఱతో చేస్తారు. చక్కటి లక్కపని నగిషీతోనూ రంగులతోనూ అందంగా శిల్ప చాతుర్యం వెలువరిస్తూ ఉంటుంది యిది. దీనిలో తేనెపట్టు కొవ్వుతో చేసిన కొవ్వొత్తి ఉంచాలని విధి నియామకం; అయితే ఛత్రం సమర్పయామి చామరం సమర్పయామి అంటూ అక్షింతలే వేసినట్టు, ఆ పేరు చెప్పి మామూలు కొవ్వొత్తులే వాడతారు! ఈరోజుల్లో సాధారణంగా యీ "వొస్సా దివ్వె" అయిదు వేళ్ల పొడుగు ఉంటుంది; కొన్ని చోట్ల యీ దివ్వెమీద కొవ్వొత్తికి బదులు నూనె దీపం ఉంచడంవూ కద్దు.



వొస్సా దివ్వె

ఈ వొస్సా ఆరంభంనాడు, అంటే ఆషాఢ బ॥ పాడ్యమినాడు రాజుగారు స్వయంగా గాని, లేకపోతే రాచకుటుంబంలో తరవాతవారుగాని చాలా గొప్పగా

**క్రొవ్విడి లక్ష్మన్న**

చేసినవి అయిదు వొస్సా దివ్వెలు వెలిగిస్తారు; ఒకటి కోటలో ఉన్న పూజా మందిరంలోనూ (ఇందులో బుద్ధుడివిగ్రహం ఉంది), ఇంకోటి సింహాసనం అదీ ఉన్న కొలువు కూటానికి పక్కగా ఉన్న పితృదేవతల మందిరంలోనూ (*family altar*), ఇంకోటి *Sacred Sword* ఉన్న ఆయుధాగారంలోనూ, మరొకటి సిల్వర్ పెగోడాలోనూ ఉంచుతారు. అయిదోది ఊళ్లోనూ చుట్టుపట్లా ఉన్న పెగోడాల వొస్సా దివ్వెలకోసం పంపించాలి. (ఈ పెగోడాలూ అవీ లెఖ్ఖపెట్టి, అయిదోశాపతు వంధోమ్మిది దివ్వెలు తయారు చేస్తారు)

ఆనాడు "బకు" లు (రాజ పురోహితులు) హిందూ దేవతలకి పూజా పునస్కారాలు చేసి, మూణ్ణెల్లదాకా మరి ఆహ్వాన విసర్జనలు లేవని విన్నవించుకుంటారు!

ఆతోలి రోజునుంచీ, అంటే ఆషాఢ పౌర్ణమినుంచీ, ప్రతీ పెగోడాలోనూ ఒకటే సందడీ, అడావిడీన్నీ. ఉదయాన్నే బుద్ధ భిక్షువులంతా చేరి బుద్ధత్రయాన్ని ఆరాధిస్తారు; బుద్ధ ప్రవచనాలు పఠిస్తారు; శిష్యగణానికీ, భక్త బృందానికీ బోధచేస్తారు; పితృదేవతలకి "దా" కర్మ (తర్పణం లాంటిది) చేస్తారు. పొద్దుటి కార్యక్రమం, భస్టు క్లాసయిన భోజనంతో ముగుస్తుంది. ఈ విందుభోజనం (స్వాములవారిని భిక్షకోసం యింటికి ఆహ్వానించినప్పుడు చేసే విందులాంటిది) భక్తులు సమర్పించుకుంటారు. సాయంత్రం మళ్లీ మతబోధా, భక్తిగీతాలున్నూ.

మర్నాడు వొస్సా ప్రారంభం. తెల్లతెల్లవారుతూ ఉంటే "వొస్సాదివ్వె" అట్టహాసంగా పెద్ద సంబరంతో తీసుకు వెళ్లి ఊరేగిస్తారు.— మంత్రాలూ అవీ చదువుతూను. సాధారణంగా పెగోడాకి ఎడంగా వెళ్లి, కుడివేపుకి తిరుగుతూ ముమ్మారు ప్రదక్షిణం చేసి మరీ ప్రవేశిస్తారు కోవెల. అక్కడ యీ దివ్వెని పవిత్రీకృతంచేసి వెలిగిస్తారు. బుద్ధ భిక్షువులంతా తమ తమ "సీనియారిటీ" ప్రకారం కూచుంటారు (ఘనా జటా చెప్పకున్నవాళ్లు ముందూ, మామూలు బ్రాహ్మలు తరవాతా అని మన వేపు ఉన్నట్టు!). అందరిలోకీ వృద్ధుడు "వొస్సాఽరంభం" ప్రకటిస్తాడు. మిగతా వాళ్లు "తథాస్తు" అంటారు.

ఈ వొస్సామూణ్ణెల్లూ బుద్ధ భిక్షువులు పెగోడాదాటి దేశంలో తిరగడానికి వీల్లేదు. తల్లిదండ్రులకి గాని, గురువులకి గాని జబ్బుగా ఉందని తెలిస్తేమాత్రం వెళ్లి చూడ్డానికి పర్మిషను ఉంది గాని, వారం రోజుల్లో తిరిగి వొచ్చెయ్యాలి. అలా వెళ్లే ముందు ఏడు రోజుల్లోగా తిరిగి వొచ్చేస్తానని చెప్పి మరీ వెళ్లాలి; రాగానే గురుపాదుల దర్శనం చేసుకుని హాజరుమనవి చేసుకోవాలి. ఏదైనా కర్మంచాలక ఆగడువులోపల తిరిగి రాలేకపోతే, శ్రావణ బ॥ పాడ్యమీ లగాయతూ మళ్లీ వొస్సా పట్టాలి వాడు!

## కాంబోడియాలో మహాప్రళయం!

భాద్రపద బ॥ పాడ్యమీ లగాయతు 15 రోజులు కాంబోడియాలో కూడా మహాళయపక్షం. భాద్రపదంలో ఆకాశంఅంతా కారుమేఘాలు కమ్మి ఎడతెరిపి లేకుండా వర్షం అలా కురుస్తూనే ఉంటుంది; అందులోనూ బహుళ పాడ్యమినుంచీ ప్రతీరాత్రీ (అసలే కృష్ణపక్షపు రోజులు, అందుకు తోడు ఊఃవర్షం, మేఘాలున్నూ) చిమ్మచీకట్లతో భయంకరంగా ఉంటుంది. అదుగో, ఆరోజుల్లో యమధర్మరాజు చచ్చిన వాళ్ల ఆత్మలని నేలకి వొదులుతాట్ట— కాస్సేపు బతికున్నవాళ్లతో కలిసి ఉండటానికి! ఏడు పెగోడాల్లోనూ కూడా ఎక్కడా వీటికి భుక్తి దొరక్కపోతే ఆ ఆత్మలు వాటివాటి బంధువర్గాన్ని శపిస్తాయిట. అంచేత వీటి తృప్తికోసం పిండ

ప్రదానం చేస్తారు. పిండానికి "బెన్" అంటారు వీళ్లు.



బెన్ (పిండం)

ఈ పిండాలు – అన్నం, కొబ్బరిపాలూ, కూరగాయలూ అవీ వొండి – చేస్తారు. మధ్యని ఓ "కేకు" పెట్టి, చుట్టూ యివి ఓ పళ్లెంలో పెట్టి, ఆ పళ్లెం చిన్న స్టాండు మీద నిలబెడతారు. దానిమీద ఓ అరిటాకు మిఠాయి పొట్లాంలా కోనికల్ (*Conical*) గా చుట్టు కప్పుతారు. దాని మధ్య ఓ కొవ్వొత్తీ, అటూ యిటూ ఊదొత్తులున్నూ. సాధారణంగా యీ పక్షంలో పదిహేను రోజులూ, పదిహేను "బెన్" లు పెడతారు కాని, యీ ఆచారం స్థలాన్ని బట్టీ మారుతూ ఉంటుంది. ఓ ఊళ్లో అయిదే బెన్లు; యీ అయిదు ఆ ఊళ్లో ఉన్న బుద్ధ పంచ కొనికిట. మామూలుగా వీటిని తీసుకెళ్ళి పెగోడాల్లో సమర్పిస్తారు; తరువాత పళ్లెం అదీ అక్కడ వొదిలేసి పిండప్రసాదం మాత్రం యిళ్ళకి తీసుకుపోతారు.

భాద్రపద పౌర్ణమి మొదలు జనం అంతా యీ ఆహుతులు సమర్పించే చోట పెగోడాలో చేరతారు. పెగోడాలో యీ భాగం చక్కగా అలంకరిస్తారు. అక్కడ కూచుని మంత్రాలూ అవీ వింటారు. రాత్రిపూట ఒకడు డోలు వాయిస్తాడు. ఆ డోలు చప్పుడు విని రాత్రి అంతా మళ్ళీ అక్కడికి చేరుకుంటారు. అప్పుడు పిండ ప్రసాదం తీసుకుని యిళ్లకి పోతారు. అన్నట్టు, చెప్పడం మరిచిపోయేను! ఈ ప్రకారం పెగోడాలోకి వెళ్లినప్పుడల్లా ఎడంనుంచి కుడికి ముమ్మారు ప్రదక్షిణం చేస్తేనేగాని పెగోడాలోకి వెళ్లడానికి వీల్లేదు. తెల్లవారు ఝామున బుద్ధభిక్షువులకి భోజనం పెడతారు. మధ్యాహ్నం పన్నెండు గంటల వేళప్పుడు మళ్ళీ వొచ్చి భిక్షువులకి తృప్తిగా భోజనం పెడతారు.

## కోటలో మహాళయం:

కోటలో మహాళయం బహుళ ఏకాదశి నాడు జరుపుతారు. క్రిందటి మహాళయం * తరవాత పవిత్రం చేసిపెట్టిన బుద్ధమూర్తిని సింహాసనం అదీ ఉన్న కొలువుకూటంలో పెట్టి, అక్కడ దానిముందు జరుపుతారు తంతు. ఆ సాయంకాలం బుద్ధభిక్షువులు అక్కడ ప్రార్థనలు సలుపుతారు; మర్నాడు ప్రొద్దున్నే నాలుగ్గంటలకల్లా వచ్చి, పది గంటలదాకా మళ్ళీ ప్రార్థనలుచేసి, (తరవాత, వారికి సమర్పించుకున్న) భోజనం చేస్తారు. ఆ మధ్యాహ్నం ఈ జట్టు భిక్షువులు మారిపోయి, మరికొందరు వొస్తారు. చివరిదాకా యిది యిలా నడుస్తూ ఉంటుంది.

త్రయోదశినాటి మధ్యాహ్నం ఆరంభించి చతుర్దశి అంతంవరకూ ⊙ చివరి నలుగురు రాజుల ఆత్మల శాంతికోసం స్పెషలు మంత్రాలు చదువుతారు. ఈ తంతు జరుగుతూన్నప్పుడు రాజుగారూ, ప్రభుకుటుంబం కొలువు కూటంలో మంత్రులూ, ఉన్నతోద్యోగులూ అంతా హాజరు అవుతారు.

ఈరోజుల్లో ఓ కోరానూలు దారం తెచ్చి ఒక కొన ప్రధాన బుద్ధభిక్షువుదగ్గరఉన్న పవిత్రోదకాలలోనూ, రెండోకొన పితృదేవతలుఉన్న మందిరంలోనూ ఉంచుతారు. మంత్రాలమహిమ యీ నూలుపోగుద్వారా పితృదేవతలని చేరుకుంటుందని నమ్మకం! ఈ మహాళయానికి ఫ్రెంచి ప్రభుత్వప్రతినిధి కూడావొచ్చి, రాజుగారితోపాటు, పితృదేవతలవిగ్రహాలకి పుష్పాలు సమర్పిస్తాడు. రాచపురోహితులు మంత్రాలు చదువుతారు.

ఒకానొకప్పుడు కాంబోడియారాజ్యం బాగా విస్తరిల్లినరోజుల్లో రాజుగారు యీనాడు తమసంతతితో నలుగురు పిన్న వయస్కులకి కిరీటాలూ అవీపెట్టి, నాలుగు కత్తులిచ్చి అలంకరించి వారిని "సామంత రాజులు"లాగ ఏదో ఆర్భాటంచేసేవాట్ట గాని, యిప్పుడు అదంతాపోయి, కత్తులు మాత్రం కోట మ్యూజియంలో మిగిలి ఉన్నాయి.

అదలా ఉంచగా యీ మహాళయానికి రెండుటేబిల్సు గతించిన రాజుల విగ్రహాలకి ఎదురుగాఉంచి, ఓదానిమీద వారి బంగారపువస్తువులు (జవహారీ) అంతా పేరుస్తారు రెండోదానిమీద వెండివస్తువులున్నూ. ఈ రెండోదానిమీద వస్తువులు పితృదేవతల ఆత్మలకిట! కొబ్బరినీళ్ళతో నింపిన కలశాలూ, కొవ్వొత్తులూ ఉండనేఉంటాయి. రాజుగారు విగ్రహాలముందు కొవ్వొత్తి వెలిగించి దీపంపెట్టి, తొమ్మండుగురు రాచపురోహితులు మంత్రాలు చదువుతూ యీ కలశాల్లో కొబ్బరినీళ్లు రాజుగారిచేత తర్పణం చేయిస్తారు. శంఖారావం విధిగా జరిగితీరాలి యీ కర్మకాండ జరుగుతూన్నంతసేపూను. తరవాత రాజుగారు పితృదేవతలకి సాష్టాంగపడతారు. ఆతరవాత యీప్రకారంవే రాచకుటుంబం మంత్రులూ ముఖ్యోద్యోగులూకూడా తర్పణాలు వొదులుతారు.

ఆపైన బుద్ధప్రవచనాలు చదివి కర్మకాండ ముగించి, యింకో బుద్ధవిగ్రహం పునీతంచేసి స్థాపిస్తారు. ఈ బుద్ధవిగ్రహం మళ్ళీ మహాళయంవరకూ పనికి వొస్తుంది.

ఇహ జనసామాన్యం యావన్మందికీ కూడా భాద్రపద బ॥ అమావాస్య అతి ముఖ్యం అయిన రోజు. ఆవేళ * కుడుములు వొండుతారు. వీటిని బుద్ధభిక్షువులకి సమర్పిస్తారు; కొంతమంది బంధుమిత్రులతో సహా ఆరగించడంవ్వూ కద్దు.

(ఇంకావుంది)

---

* మహాళయం చివరిరోజున యీ బుద్ధమూర్తిని తీసేసి, ఇంకో విగ్రహాన్ని, మంగళస్నానం అదీ చేయించి, వాడుకుంటారు వొచ్చే మహాళయం దాకా.

⊙ *Their Majesties Ang - Duong; Norodom; Sisowath and Monivong.*

* ఇడ్లెన్లూకావు, అలా అని కుడుములూ కావు; కాని, ఆవిరిమీద ఉడకడంనుంచి అలా అన్నాను, ఆకారాన్ని బట్టీని.

# దొంగా....లింగమూర్తి

గొల్లపూడి కేశవరావు

లింగమూర్తి విజయవాడలో "అగ్గిరాముడు" సినిమా చూస్తూ పూర్తిగా యింటివిషయం మరిచిపోయాడు. అతని అర్ధాంగి సుభద్రమ్మ ఆదమరిచి నిద్రపోతూ వుంది - నూజివీడు కోనేటి పేట మొదటివీధిలో వున్న తాటాకుల కొంపలో. వంటయింటి తాలూకు దొడ్డి గుమ్మపు తలుపుకు వుతకలు ఎత్తే ప్రయత్నంలో నిమగ్నుడై యున్నాడు ప్రత్యక్ష అగ్గిరాముడు వొకడు.

అగ్గిరాముడు, అంటే దొంగ, చప్పుడు కాకుండా వుతకలెత్తి వూడబెరికిన తలుపుచెక్క జాగ్రత్తగా దొడ్డిగోడకి నిలబెట్టి వంటయింటిలోకి హుటాహుటిని ప్రవేశించాడు. అది శుక్లపక్షమున్నూ పైగా దశమిన్నీ కావటంవల్ల వంటయింట్లోని వస్తుసముదాయం లీలగా కనపడుతూ వున్నవి. భర్త ఏ ప్రొద్దుపోయి యింటికి చేరుకుంటాడో అనే వుద్దేశంతో వుత్తమ యిల్లాలు సుభద్రమ్మ మంచినీళ్ల బిందెమీద భద్రంగా బోర్లించిన వెండికంచం ఎనభై తులాల పిడిరాయిలాంటి కంచం తళతళా మెరుస్తూ ఆ ముష్కర తస్కరునికి దృగ్గోచరం అయింది. ఆ బిందెకు చేరువనేవున్న పురాకాలపు రాచ్చిప్పలో సుభద్రమ్మ పోపుపెట్టి నూరి అట్టే పెట్టిన కందిపచ్చడి వాసన ఘుమాయింపు నిరభ్యంతరంగా వాడి నాసికాపుటాల్లోకి ప్రవేశించి మనిషిని నిలువునా నీరుచేసి పారేసింది. అతగాడికి అందుబాటులో వుట్టిమీదవున్న స్నిగ్ధమైన గేదె పెరుగు కనపడుతూనే వుంది. బొత్తిగా శీతాకాలం కావటంవల్ల అగ్గిరాముడికి పేరిన నెయ్యి వెతుక్కోవలసిన అవసరం ఏమిన్నీ లేనేలేదుగదా! సదరు పరిస్థితుల్లో ఆ గజదొంగ నోట్లో లాలాజలం సమృద్ధిగా వూరి, అంతతో పోక జఠరాగ్నిని ప్రకోపింపచేయటం మూలంగా, తాను వచ్చిన అవసరమైన విషయం విస్మరించి చక్కగా కంచం పెట్టుకొని స్వయంగానే వడ్డించుకొని తాపీగా భోజనం చేయటానికి వుపక్రమించాడు - ఆ హద్దుమీరి వచ్చిన అర్ధరాత్రపు అతిథి. అయితే అదే సమయంలో అతగాని అదృష్టదేవత ఓ చిన్న అపస్వరం పలకటంతో సిద్ధాన్నం కాస్తా అర్ధాన్నం చేసుకోవలసిన అవస్థ కలిగింది. సుభద్రమ్మ కందిపచ్చడి చేయటంలో అందెవేసిన చెయ్యి! అందాకా ఎందుకు ఆమె కందిపప్పు చేస్తూవుంటేనే ఆ కమ్మటివాసన పక్కయిండ్లలోకి జొరబారి ఆ గృహాల తాలూకు యజమానులు నోళ్లువూరినవారలై తమతమ భార్యలతో,

"అద్దిగదీ - ఆ సుభద్రమ్మగారిలా చెయ్యాలి వంట అంటే" అంటూ నిష్పక్షపాతంగా విశిష్ట గురుత్వం కనిపెట్టేవరకూ వుంది ఆమె నేర్పు. అదిన్నీ గాక ఆరోజు ఆవిడగారికి తీరుబడిలావు అవటంవల్లనైతేనేమి, మరెందువల్లనైతేనేమి తీరిగ్గా పప్పు రుబ్బటమే కాకుండా పోపుకూడా తగిలించి, అయిదంటే అయిదు ఎండుమిరపకాయలు ఆపళాన నూనెలో వేయించి పచ్చట్లో గుచ్చిఎత్తింది. అదుగో చూశారూ, ఆ అయిదు మిరపకాయల తాలూకు ఒక మిరపకాయ దొంగగారు జిహ్వాచాపల్యం



# ★ దొంగ.... లింగమూర్తి ★

వల్ల కోరకటం ఆయన తప్పిదం కాదుకాని ...భోజనానికి కూర్చోక పూర్వమే ఆ గూట్లో కొట్టవచ్చినట్టుగా కనిపిస్తూ వున్న రాగిచెంబుతో నిండా మంచితీర్థం పెట్టుకు కూర్చోకపోవటం ఆ సమయంలో అతగాడి కుత్తుకపట్టుకుంది.

లింగమూర్తి నిజంగా కారం ఎక్కువ తింటాడు. ఆపైన గుంటూరు మిరపకాయలు అంటే అతడికి అమితమైన అభిమానం కూడాను. అదే యిప్పుడు అగ్గిరాముడు కొంప కూల్చింది. వేలెడులేని ఆ మిరపకాయ - దాని "పొగరు" కూలా... వాడి జీర్ణకోశంలోకి పోక సప్తపథవరకూ సరిగ్గానే పోయి దరిమిలా శ్వాసకోశంలోకి నేరుగా దారితీయటంవల్ల అగ్గిరాముడు వుక్కిరి బిక్కిరై, ఆపైన కింకర్తవ్య విమూఢుడై - కూర్చోలేక - నుంచుంటానికి శక్తి లేక పెళ్లున దగ్గటం ప్రారంభించాడు. పెదిములు బిగించి ఎంగిలిచేత్తోనే నోరు గట్టిగా మూసుకొని అతి ప్రయత్నంమీద అతగాడు ప్రయాసపడి దగ్గు ఆపుకోటానికిగాను మానవ



మాత్రుడు చేసే యావత్తు ప్రయత్నమూ చేశాడు. అందువల్ల వుపకారం ఏవీ లేకపోగా ఆ కారం ఘాటు ముక్కురంధ్రాలగుండా మహోరీవేగంతో బయటకు రానూ వచ్చింది.

వంటయింట్లో అగ్గిరాముడు యీ విధంగా ఆయాసపడుతూ వున్న సమయంలో సుభద్రమ్మ అదమరిచి నిద్రపోతూ వున్నమాట వాస్తవమే. అయితే ఆమె పక్కనే పడుకున్న పదినెల్ల కుర్రకుంక—అంటే మరెవ్వరూ కాదు లింగమూర్తి సుభద్రమ్మల గర్భసుక్తి ముక్తాఫలం—వాడు ఏకబిగిన రాగం ప్రారంభించటంతో ఆ యమ్మ అదిరిపడి దిగ్గున లేవటం, వంటయింటిలో కుండేలుచేసే చప్పుడువిని ఎలుగెత్తి పక్కవాటాలో వున్న పున్నయ్య పంతులును కేకేసింది. అప్పటికి సగం తెలివిలో వున్న పున్నయ్య "అరి పట్టుకోండ్రా" అంటూ తను గదిలోనే వుండి పొలికేక పెట్టటంతో అగ్గిరాముడు అదటున లేచి అర్ధాకలితోనే పరుగు లంకించుకొని దేహశుద్ధి మాత్రం కాకుండా తప్పించుకు బయటపడ్డాడు. ఏవయితే నేమి ఆ అపురూపమయిన వెండికంచం చెయ్యిదాటిపోకుండా వెనకనే మిగిలినందుకు సుభద్రమ్మ ఎంతో సంతోషించిన మాట యథార్థమే గాని, యిల్లు అంతా మైలుపడిపోయిందని ఆదొంగ వెధవని గుమ్మఎత్తిపోస్తూ ఆమె మనస్సు ఎంతో కష్టపెట్టుకుంది. మర్నాడు పొద్దునే లేచి యిల్లంతా అలుక్కొని లింగమూర్తి కోసం దాచిన ఆ అమోఘమైన కంది పచ్చడి యావత్తూ పూరాగా పనిమనిషికి పెట్టి సుభద్రమ్మ చాలా కష్టపెట్టుకుంది మనస్సు.

అదుగో అదే సమయంలో లింగమూర్తి గృహప్రవేశం చేయటమున్నూ జరిగింది. వాకిట్లోనే ఎదురుపడిన పున్నయ్య పంతులు గారు గతరాత్రి జరిగిన సమాచారం మొత్తం వివరంగా చెప్పటమే కాకుండా ఆ దొంగ వెనకాల తానొక్కడూ రెండువందలగజాల దూరం అసహాయశూరుడై పరుగెత్తిన పైనమున్నూ, వాడు కనపడ్డవాడు కనపడ్డట్టే వరిచేలమాటున ఎల్లా అదృశ్యమైనదిన్నూ చెప్పి

"ఇంకా అదృష్టవంతులు యింతకీనూ... అంతతోనే పోయింది" అన్నాడు.

శాదం ఆకులో కందిపచ్చడి పెట్టించుకు పోతూన్న పనిమనిషి రామి—

"దొంగ ఎదవ......పచ్చడిమీద మోజు పడిండు సచ్చినోడు" అని చేతిలో పచ్చడి వంక చూసి నవ్వుకుంటూ బయటికి పోయింది.

లింగమూర్తి తల ఎగరేసి నేరుగా ముందు వంటయింటి గుమ్మందగ్గరికిపోయాడు. అంతలోనే అదరిపడి వెనకనేవున్న సుభద్రమ్మ వంక చూసి అన్నాడు.

"ఎవరూ యీ పని చేసింది?"

ఇంతకీ జరిగిన అఘాయిత్యం ఏమిటంటే గోమయంతో శుభ్రంగా అలుకబడ్డ ఆ వంట యిల్లు యావత్తూ మనోహరమైనటువంటి ముగ్గులతో కలకలలాడుతూ వుంది! సుభద్రమ్మ తెల్లవారుఝామునుంచీ వళ్లు విరక్కొట్టుకొని కష్టపడి చేసిన యింత ప్రయత్నమూ - ఆమె ఓర్పూ, నేర్పూ లింగమూర్తి ఎంతమాత్రం గ్రహించకుండా అనవసరంగా ఆగ్రహపడటానికి హేతువు ఆ యిల్లాలు మరోలా వూహించింది. ఆపైన అన్నది గదా—

"ఏదీ పున్నయ్యగారికి దొరికి—"

"నోరు ముయ్యి...శనిపీనిగా" అదలించి మాట త్రుంచాడు లింగమూర్తి.

సుభద్రమ్మ విస్తుపోయింది. ఇంతకీ లింగమూర్తి కోపానికి కారణం ఆమెకు ఎంతమాత్రమూ అంతు చిక్కలా. అసలు దొంగపడటానికి గానీ, వాడు చిక్కకండా పారిపోవటానికి గానీ తాను ఉత్తరవాది ఎల్లా అవుతుందో—అందుకూ తన భర్త యింత ఆగ్రహోద్రగుడు కావటానికిగల హేతువూ ఆమె ఆలోచించి కూడా తెలుసుకోలేకపోయింది.

"ఎవరూ దొరక్కపోతే కట్టుకున్నదాని మీద చూపించగలరు ప్రతాపం" అనుకున్నది సుభద్రమ్మ. కేవలం అనుకోటమే కాదు వీలయినంత మెల్లిగా గొణుక్కుంది కూడానూ అవే మాటలు.

అయితే లింగమూర్తి కోపానికి కారణమే లేదా? అది కేవలం నిర్హేతుక దురాగ్రహమేనా? కాక సుభద్రమ్మ చేసిన సైకో ఎనాలసిస్...మాత్రమే సత్యమూ అంటే జవాబు లేకపోలేదు.

జరిగిపోయిన అపచారం విచారపడ్డా చెరిగిపోదని లింగమూర్తి గ్రహించి తొందరలోనే శాంతించాడు.

"పడుకునేముందు యిల్లు అలికే పడుకున్నావా?" అని సుభద్రమ్మని అడిగాడు.

"అయ్యో అలక్కమండీ ... ఏ వేళకు వస్తారో అని వండికంచంకూడా మంచినీళ్ల బిందెమీదే అట్టిపెట్టాను" అమాయకంగా అన్నది సుభద్రమ్మ.

"అఘోరించినట్టేవుంది తెలివి - ఇప్పుడు మళ్ళీ అలికి తగలెయ్యమని ఎవడు ఏడిశాడూ" గట్టిగానే అదమాయించి అన్నాడు లింగమూర్తి.

దొంగతాలూకు శ్రీ పాదపద్మాలరేఖలు ఏవన్నా ముద్రపడివున్నా సుభద్రమ్మ అమాయకత్వంవల్ల తనరాకకు వో అరగంట పూర్వమే అవన్నీ మరుగుపడిపోయాయని

లేకుంటే దొంగ దొరకటానికి కావలసిన ఓ అమూల్యమైన "క్లూ" లభ్యమయ్యేదనీ లింగమూర్తి భావించాడు.

రొండ్డిచుట్టూ రెండుసార్లు దీక్షగా తిరిగినా ఏవిధమైనటువంటి ఆధారమూ దొరక్కపోవటంతో ఆ పరిశోధకుడి అనుమానాలు అపరిష్కృతంగానే వుండిపోయాయి. ఇటు చూస్తే సుభద్రమ్మ ఏమో పెండికంగం మొదలుకొని రాచిప్పవరకూ శుభ్రంగా కడిగి అట్టిపెట్టటంతో అజ్ఞాతంగా దొంగను కమ్మిచేసిందని లింగమూర్తి గట్టిగా నమ్మాడు.

లింగమూర్తి డిటెక్టివ్ శిక్షణ పొందని మాట నిజమే అయినా అందరికీ మల్లేనే తానూ చాలా తెలివిగలవాడనని నమ్మటంలో ఆత్మద్రోహం ఏంవున్నది గనుక!

స్నానాదికాలూ భోజనభాజనాలూ అయిన అనంతరం లింగమూర్తీ, భార్య సుభద్రమ్మా తీరిగ్గాకూర్చుని రాత్రి జరిగిన ఈ విషయంబాపతు రహస్యభేదనానికి పూనుకున్నారు.

"అయితే యిది ఎవరో తెలిసినవాళ్లు చేసినపనే అయివుండాలి" అన్నది సుభద్రమ్మ. ఆవిడ యీ నిర్ణయానికి రావటానికి గల, కారణాలు వాస్తవంగా ఆవిడకూ తెలియవు.

"ఏం" ఆమెవంక చూసి అడిగాడు లింగమూర్తి.

"కాకుంటే మీరు వూళ్లోలేరని వాడికి ఎలా తెలుసు?"

లింగమూర్తి లేకపోవటానికీ, దొంగ పడటానికీ మధ్య లింగమూర్తి వూళ్లోలేడని ఆ ముచ్చుకు తెలియటమే యిందుకు కారణమయివుండవచ్చునని సుభద్రమ్మ విశ్వాసం.

లింగమూర్తినవ్వాడు - ఎంతో గర్వంగా నవ్వాడు! సుభద్రమ్మకు తట్టిన యీ ఆలోచనకూ మరోకంగుకూనా. తనలాంటి మగవాడు లేడని ఆమాత్రీ చిక్కబట్టిగా ఆ చోరాగ్రేసరశిఖామణి ధైర్యంచేసి కొంపలోకి దూరలిగాడు!

"నిజమే కావచ్చు. ఏవూరుపోయినా అందుకనే ఎంతపొద్దుపోయినా యింటికి చేరుకుంటూ వుంటాను. అయితే నేను వస్తానో రానో అని లాస్టుబస్ టయిము దాటేదాకా వాడు విగ్రహందగ్గిర కాపలా కాసే వుంటాడు"

"అయినా రోజులు బావులేవుబాబూ. మీరేమో పదివూళ్ళ పాపరాజులు. యిటు చూస్తే వక్కదాన్ని" అని భర్తతో ఫిర్యాదు చేసుకొంది, అత్తగారితో దెబ్బలాడి వేరింటి కాపురం పెట్టించిన సుభద్రమ్మ.

"అరుగో వాడూ ... శంకరంగాడు బలవంతాన ఆపాడుగాని లేకుంటే రాకపోయానా" అన్నాడు లింగమూర్తి.

తనకు తెలిసిన విషయాలన్ని కూర్చుకుంటూ తద్వారా దొంగయొక్క చిత్తవృత్తుల్ని కనిపెట్టే ప్రయత్నంలో పడిపోయాడు లింగమూర్తి. రెండుమూడు నిముషాలు నిశ్శబ్దంగా ఆలోచించి అప్రయత్నంగా అన్నాడు.

"ఏమన్నావూ"

"నేను ఏవీ అనలేదండీ"

మధ్యలో మాట్లాడి తన భావనాపరంపరకి అడ్డు తగలవద్దని చేతితో సైగచేసి అపాగు భార్యని! అవును! వచ్చినదొంగ వక్కడే అయివుంటాడు. వాడికి తను వూళ్లోలేని సంగతీ, ఆ రాత్రివరకూ రానిసమాచారమూ తెలుసు. బహుశః ఆదొంగ తిండికి జరగక దొంగతనానికి అలవాటుపడ్డవాడే అయివుంటాడు. ఆరోజురాత్రి వాడు యింటి దగ్గర ఎగిరింజినిళ్ళతోటో నాలుగుమెతుకులు ఎంగిలిపడివుంటాడు. అందువల్ల ఆ పెరుగూ, పచ్చడీ, సన్నబియ్యపు అన్నమూ చూడగానే వాడినోరు జల చచ్చివున్నదేమో తిండిమీద మనసు పోయివుంటుంది. వచ్చినవిషయం తరువాత చూచుకోవచ్చులెమ్మని . అదిగాక యింతలో లింగమూర్తి వచ్చే సూచనలు లేనందువల్లా, వాడు తిండికి వుపక్రమించి వుంటాడు. ఇందులో అసహజం ఏమున్నది! అయితే వక చిన్న సందేహానికి యిందులో చోటు వున్నది. మీద యింత సుహోకార్యం పయిన వేసుకొని వచ్చినవాడు ముష్టి పచ్చడిమీద మోజుపడి ఆగిపోతాడా? అహా! ఎందుకు ఆగకూడదు. బకాసురుడితో దెబ్బలాటకి పోతూకూడా భీమసేనుడు బండిమీదనే భక్ష్యాలుయావత్తూ భుజించలేదా. ఆతుధానుడు అమాంతం వెన్నున జరవగా ఆ అనిలతనయుడు విచలితుడుకాకుండా ఓగిరం పూరాగా ఆరగించలేదా! అదేవిధంగా యీ దొంగవెధవ లింగమూర్తి పడమటిల్లుచొచ్చి ముందువచ్చే ముప్పు తెలియకో, అటువంటిముప్పే వస్తే పారిపోవచ్చుననే దిలాసాతోనో యీపనికి పూనుకొనివుంటాడు. అయితే అతగాడు మందబుద్ధి అయివుంటాడు. నిపుణమతి ఎంతమాత్రం కాదు. "బంగారంలాంటి వెండి కంచం" కళ్ళఎగుట కొట్టవచ్చినట్టుగా కనపడుతూవుంటే, మరో ఆలోచనకు ఎడమియ్యకుండా అది చేతపుచ్చుకొని వుడాయించవలసియుండగా తాత్కాలికమూ క్షణికమూ అయిన యీకాస్త సుఖప్రాప్తి కొరకున్నా, ఆకలినుంట దల్లార్చుకునే నిమిత్తమున్నా వాడు ముందువున్న మహాలక్ష్మిని పెంపెడలా కొలతన్నుకున్నాడు!

"మాశావాపిల్లా" అన్నాడు లింగమూర్తి ఆలోచనలు ఆపుచేసి. పిల్ల అంటే సుభద్రమ్మ - భర్తవంక చూసి నవ్వింది వింటానికి సిద్ధంగావున్నానని ఆవిధంగా తెలియజేస్తూ.

"అదికాదుగాని యింతకీ వాడు అంత వుక్కిరిబిక్కిరికావటానికి కారణంఏమో

# ★ దొంగా....లింగమూర్తి ★

అంతు చిక్కకుండా వున్నది ... అంత నెయ్యీ గుమ్మరించుకున్నాడా లేదా మరి"

సుభద్రమ్మ వుట్టిమీద పెట్టిన గిన్నెడు నెయ్యీ గుమ్మరించుకునికూడా, ఆదొంగ ఎదురుతిరిగిన మిరపఘాటుకు తట్టుకోలేక పోయాడు.

"అదేమో మరి చిత్రంగానే వున్నది సుమండీ" బుగ్గను చెయ్యిపోనిచ్చి అన్నది సుభద్రమ్మ.

లింగమూర్తి ఒక్క క్షణం దీక్షగా ఆలోచించాడు. అప్పైన భార్యవంక చూసి

"ఆ కందిపచ్చడి నువ్వు వేసుకున్నావా?" అని అడిగాడు.

"ఆహా వేసుకున్నానూ ... అవునా ఓ వుప్పురాయి వెయ్యాలేమో యింకా అనుకున్నాను కూడాను ... చచ్చినాడూ" ఆ దొంగని మరోమారు మనస్సులో తిట్టుకుంది సుభద్రమ్మ.

"నీకు ఎప్పుడూ వున్నదేగదా...కొంచెం కారం ఎక్కువ తగిలించి వుంటావు" తన వంటకు భర్త వంకలు పెట్టడం ఎప్పుడూ వున్నదే అయినా ఆమె సుతరామూ యిష్టపడదు.

"దొంగకి కారం ఎక్కువఏమిటండీ –" అని విరగబడి నవ్వింది సుభద్రమ్మ. ఆవిడగారిఅభిప్రాయంలో దొంగ మానవమాత్రుడు కాడనీ, వాడికీ షడ్రుచులూ తెలియవని గానీ కాదుగాని, తనంతతా భోజనానికివచ్చిన అతిథికూడా వంట బావులేదని అనలేదుగదా – దొంగవెధవకి ఆమాట అనుకోటానికి కూడా అర్హతవుండదే అని ఆమె అభిప్రాయం కావచ్చు.

"నా వంటకి మీరు వంకలు పెట్టనిది ఎప్పుడూ—అయినా మీకు యిష్టంగదా అని అయిదంటే అయిదు మిరపకాయలు కూడా వేశాను......యింతకీ దేనికైనా ప్రాప్తముండాలి" జబ్బలు పీక్కుపోయేలా రుబ్బి తయారుచేసిన వస్తువ నోటిదాకా వచ్చినట్లే వచ్చి జారిపోయిందిగదా అని ఆమె ఆవేదనపడ్డది.

అయితే లింగమూర్తి ఆలోచనా స్రవంతి మరో దిక్కుగా మహావేగంతో మళ్ళింది.

"నువ్వు వంటయింట్లోకి వెళ్ళేటప్పటికి రాగిచెంబు ఎక్కడ వున్నది?"

"అది గూట్లోనే వున్నది. ఆ చచ్చినాడు తాగటానికి నీళ్లు కూడా పెట్టుకోలేదు" అన్నది సుభద్రమ్మ.

"ఇహనేం...వాడు మంచినీళ్లు కూడా దగ్గర పెట్టుకు కూర్చోలేదా! తొందరగా దిగమింగి ఆ కంచం కాస్తా చంకనెట్టుకు పోదామనుకున్నాడు—తిండి తినాలని యావైతే వుందిగాని ఎవరు ఎక్కడ చూసి పోతారో అనే తొందరలో ముక్కూ నోటా నమక్కోవటంతో నువ్వు వేసిన మిరపకారం వాడికి తీరని అపకారం చేసి వుండాలె."

ఈ మాటలు అని లింగమూర్తి తాపీగా బీడీ ముట్టించాడు. గట్టిగా ఒక దమ్ము లాగి దట్టంగా పొగ వదలి ఆ పాకిపోయే పొగలో నుంచి దీక్షగా చూడటం మొదలుపెట్టాడు వంటింటి గుమ్మంవైపు.

ఈవిధంగా వుప్పురాయి తక్కువ వేసి కారం కొంచెం ఎక్కువవేసి ఆ గృహానికి తెలియకుండానే వుపకారం చేసిన సుభద్రమ్మ భర్తవంక ఆశ్చర్యంగా చూస్తూ కూర్చుండిపోయింది.

ఆ దొంగ నిరాయుధుడై రిక్తహస్తాలతో వచ్చివుంటాడని లింగమూర్తి యిట్టే గ్రహించివేశాడు.

లింగమూర్తి లేచి నిలబడి వంటగది గుమ్మందగ్గర నిలబడి దొంగ ఎత్తి బయట పెట్టిన తలుపుచక్కవంకా ద్వారబంధం వంకా నిశితంగా చూశాడు. ఈసారి దొడ్లోకి కూడా పోయి అటునుంచి మరోసారి చూసి

"ఆహా వీ డెవడో యింటిదొంగేసుమా!" అన్నాడు అకస్మాత్తుగా—

సుభద్రమ్మ కలవరపడ్డది. అనుమానమనేది ఓ పిశాచంలాంటిది. ఎవరిమీదనా అనుమానమనేది కలగకుండానే వుండాలిగాని—మరోలాఅయితే విపరీతంకాగలదు. కొంపతీసి భర్త పున్నయ్యపంతులుమీద అనుమానపడుతున్నారేమో అనవసరంగా అని సుభద్రమ్మ సందేహం. అందుకనే కంఠస్వరం వీలయినంత తక్కువ చేసుకొని భర్తను మందలించింది ఆమె.

"ఛా! వాళ్లేమన్నా అనుకోగలరు—అరవమాకండి."

"నీ తెలివి తెల్లారినట్టే వుంది – వాడెవడో యీ యింటి గుట్టుమట్టులన్నీ యిదివరకే ఎరుగున్నాడు. ఇంటికి కన్నం తవ్వనక్కర లేకుండానే వంట యింటిలోకి రావచ్చుననీ ఆపైన అటకపైగా వెలిసిలోనుంచి సావిట్లోకి దిగవచ్చుననీ వాడికి పూర్తిగా తెలుసు. ఎందుకంటే యిల్లా చూడూ—మండిగానికీ తలుపుకూ మధ్య దూపుడు వేలూ వుంగరంవేలూ పట్టే ఎడం వుంది. దొడ్లోనుంచే తలుపు వూడదీయటానికి వీలు వున్నదనీ, అక్కడనుంచి సావిట్లోకి యిట్టే రావచ్చుననీ తెలిసే ఆ దొంగ బర్మాకూడా తెచ్చుకోకుండా దొంగతనానికి వచ్చాడు." ఇంతా చెప్పి సుభద్రమ్మ వంక చూశాడు లింగమూర్తి గర్వంగా.

తన భర్త యింత తెలివిగలవాడని—దొంగ ప్రవేశించిన నిన్నటి రాత్రి వూళ్లో లేకుండానే వాడి సమాచారం యావత్తూ పసిగట్టిచెప్పే దిట్టయనీ సుభద్రమ్మకు ఎంతో ఆశ్చర్యం కలిగించటమే కాకుండా, అకస్మాత్తుగా ఆమెగారికి తనభర్తమీద వల్లమాలిన అభిమానమూ గౌరవమూ పుట్టుకు వచ్చింది.

"మనిషి కళ్ల ఎదుట వున్నట్టే చెప్పేస్తున్నారే!" ఎంతో ఆశ్చర్యంతో అన్నది సుభద్రమ్మ.

అయితే గొప్పగొప్ప అపరాధ పరిశోధకులు అందరూ నేరం జరిగిన స్థలం చూసినంత మాత్రానే దొంగనుగురించీ వాడి మనఃప్రవృత్తుల్ని గురించీ తు. చ తప్పకుండా అంచనా వేసే గలరనే సంగతిగానీ – మధ్యాహ్నం రెండు గంటలు దాటిన వెంటనే భర్తయిల్లు దాటటానికి కారణం అతను ప్రభుత్వంవారు కొత్తగా పెట్టించిన లైబ్రరీలో చేరి షెర్లాక్ హోమ్స్‌తో ప్రారంభించి పాంచిఖడీ దేవ్ దాకా సమస్తమైన అపరాధ పరిశోధక గ్రంథాలూ తృష్ణంగా చదవటంపైగల ఆసక్తే అనీ సుభద్రమ్మకు యీనాటిదాకా తెలియదు.

అయితే భార్య తన్నుగురించి అన్న ఆకొసిని మాటలూ వినగానే లింగమూర్తి హృదయం చంద్రోదయం చూచిన క్షీరసాగరంలా పొంగింది. తన్నుగురించి ఎవరన్నా పొగుడుతూ వుంటే వింటానికి చాలా వుత్సాహంగా వుంటుంది – అది నిజమే అవుగాక – కాని ఆ పొగడ్తే భార్య ముఖతః వస్తే ఆ వుత్సాహంలో ఎంత మధురిమకూడా మిళితమవుతుందో అది అనుభవించిన వాళ్ళుమట్టుకే గ్రహించగలరు. ఏనాడూ డాక్టరు వాట్సన్‌కూడా హోమ్సుని యీ విధంగా పొగడినట్లు లింగమూర్తికి చదివిన గుర్తులేదు.

"అవును – వాడు మంచినీళ్ళు కూడా పెట్టుకోకుండానే తిండికి వుపక్రమించాడు. ఆ దొంగ బ్రాహ్మడుగాని వైశ్యుడుగానీ కాదు – అంతేకాదు వాడు సవర్ణుడుకూడా కాదు. శూద్రుల్లోకూడా వాడు అగ్రశ్రేణికి చెందినవాడు కాదు..."

"అహా! మంచినీళ్లసంగతి మరిచిపోయాడని ఎందుకు అనుకోకూడదూ?" అడ్డదిడ్డంగా ప్రశ్నించింది అయిదోతరగతివరకే చదువుకున్న సుభద్రమ్మ.

లింగమూర్తి ఆలోచనలకి అంతరాయం కలిగింది. అయితే నిసలైన పరిశోధకుడు యిటువంటి చిన్న చిన్న సందేహాలతో బుఱ్ఱ పాడుచేసుకోకూడదనీ అవ్యాహతంగా సాగిపోతూన్న యోచనా స్రవంతికి అవ్యక్త సంశయాలతో ఆనకట్ట కట్టుకోకూడదని అంటే తన రీజనింగ్ పవర్ – అంటారే – దాన్ని విశృంఖలంగా సాగిపోనిస్తే చిట్టచివ

కి ప్రారంభదశలో సందేహాలకు తావు యిచ్చిన ట్రిమ్మీ సమస్యలన్నీ సూర్యరశ్మి సోకగానే విచ్చిపోయే మంచుతెరలా తొలగిపోయి సత్యమనే పవిత్ర సందర్శనం అయి తీరుతుందని అతగాడు ఎన్ని అపరాధ పరిశోధక నవలల్లో చదవలేదు లోగడ!

"అది ఏమంత కఠిన సమస్య కాదు. ఎందుకంటే, మంచినీళ్ల బిందెమీద వున్న కంచం తీసుకుంటుండగానే వాడికి మంచినీళ్ళు పెట్టుకోవాలీ అని స్ఫురించి వుండాల్సింది. అయితే వాడు భోజనానికి కూర్చునేముందు మంచినీళ్లు పెట్టుకోవటం అలవాటు లేని కారణంచేతే ఆ విధంగా చేశాడు." అని కొంచెం ఆగి సుభద్రమ్మ సావధానంగా వింటోందో లేదో అని చూశాడు లింగమూర్తి. తరువాత మళ్ళీ యిల్లా సాగించాడు తన వుపన్యాసం "చూశావూ పిల్లా అలవాటనేది మహా చెడ్డవస్తువు. ఒకదానికి మనం అలవాటుపడ్డామే అనుకో, మనం అనుకోకుండానే ఆ పని చేసేస్తూ వుంటాము. ఏ అర్ధరాత్రో హఠాత్తుగా బీడీలు అయిపోయాయే అనుకో - ఆ అలవాటు ఎంతపని చేస్తుందంటే - యిటుచూడు నేను సగం రాత్రివేళ బీడీలు తాగనుగదా...యిదుగో అయినా సరే బీడీలు అయిపోయాయనే విషయం గుర్తుకురాగానే వెంటనే బీడీ తాగాలనే జిజ్ఞాసపట్టుకుంది. చొక్కా జేబులు అన్నీ తడుముకుంటాను - బీడీలు అయిపోయాయీ అని తెలిసికూడా - ఆ గొడవ ఇప్పుడు దేనికి ఏతావాతా తేలేది ఏమిటంటే ఆ దొంగ ఎవడో అలగా జాతివాడై యుంటాడు."

ఇంతటి మహానిర్ణయం చేసి లింగమూర్తి భార్యవంక చూశాడు ధీమాగా "ఏమంటావూ" అన్నట్టు.

సుభద్రమ్మ చాలా తేలిగ్గా తోసిపారేసింది యీ విషయాన్ని.

"ఆమాట యిప్పుడుగా మీరు అంటున్నారూ. అన్నానికి ఎప్పుడైతే ఆశపడ్డాడో అప్పుడే అనుకున్నాను వాడెవడో యానాది వెధవని"

అప్రయత్నంగా నోరుజారి అన్నమాటలు చెవినిపడ్డాయో లేదో లింగమూర్తి ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

"ఆ ఏమన్నావూ - యానాది అనిగదూ...ఆహా ఏమి నీ దూరదృష్టి!" అంటూ విస్తుపోయాడు. ఆపైన మెల్లిగా తేరుకుని.

"అవునవును...ఎక్కడో గాని మొత్తం మీద విన్నాను. వాళ్లు భోజనానికి కూర్చోబోయేముందు మంచినీళ్లు పెట్టుకోరని... ఆహా సత్యం ఎంతలో బోధపడ్డదీ..సంశయం ఎంతశీఘ్రంగా తొలగిపోయిందీ..."

లింగమూర్తి తనకు తెలిసిన యీ పరమసత్యాన్ని గురించి ఇంకా పూర్తిగా ఆశ్చర్యపడకముందే సుభద్రమ్మ వూరుకోక యీ విధంగా అన్నది.

"చూశారూ! ఈ దొంగతనాలూ యీ మధ్యనే ప్రారంభం అయ్యాయి. మొన్నటికి మొన్న ప్లీడరుగుమాస్తా లక్ష్మయ్యగారింట్లో ఇల్లాగే దొంగపడి అరవీశెడు పైచిలుకు నెయ్యివున్న టిఫిను దాటేసి; యిరవై అయిదు పౌనుల వూరగాయ జాడీలు తీసుకుపోతూవుండగా లక్ష్మయ్యగారు దొడ్లోకి అవసరం తీర్చుకోటానికి వచ్చి అదమాయించగా ఆజాడీ నాపరాయిమీద ఎత్తికొట్టి పారిపోయాడుట. బంగారంలాంటి జాడీ కాస్తా ముక్కలుఅయి వూరుకుంది. నిష్కారణంగా జాడీడు వూరగాయీ నేలపాలూ అయింది...మైలాపడ్డది...ఎందుకూ రాష్ట్రంవచ్చినా దొంగతనాలు ఎక్కువ అయాయిబాబూ"

పోతే ఆంధ్రరాష్ట్రానికీ దొంగతనాలకీ వున్న ఆ కొద్దిపాటిసంబంధం సుభద్రమ్మకి తెలియదని అనుకున్నాడు - రాజకీయాలతో అంతో యింతో ముడివున్న లింగమూర్తి.

"రాష్ట్రం రాగానే జైలులో వున్న వాళ్ళందర్నీ విడుదల చేశారు ... పేనుకు పెత్తనమిస్తే బరికి వదిలిపెట్టిందట. రాజ్యం ఏలటమంటే వుపన్యాసాలు యివ్వటం కాదుగదా. వెనకా ముందూ ఎంత ఆలోచించాలి"

"అవునా మరి. బొత్తిగా అప్పటినుంచే యీ దొంగతనాలు ఎక్కువ అయాయి బాబూ. అల్లా పేరంటానికి వెళ్ళవద్దామన్నా భయంగానే వుంటోంది"

తనకష్టాల్ని భర్తతో చెప్పుకుంటోంది సుభద్రమ్మ. ఇంతకీ యిల్లాలియొక్కట్లు అంచనావేసే ఆలోచనలేని లింగమూర్తి చెవిలో ఆమాటలు పడేలేదు. భార్య సుభద్రమ్మ ఏమరుపాటున అన్న ఆ పష్టాక్షరాలూ అతని చెవులో మారుమ్రోగుతూ మెదడుకి పని కలిగించాయి. ఆలోచనలతో మేధస్సు అచ్చుయంత్రంలా పనిచేయ మొదలుపెట్టింది.

"ఇంకేమి...పూర్వాపరాలూ సంభవాసంభవాలూ తూచుకుని ఆలోచిస్తే వీడు ఎవడో పాతదొంగే అనీ, రాష్ట్రం రాకవల్ల జైలునుంచి బయటపడి అంతా నాలుగు మాసాలూ ఆ ప్రాంతాల్లో యిటువైపు దక్కావచ్చేశాడనీ స్పష్టమవుతూంది మరి. ఇంతకీ వాడు యీ వూరివాడో యీ ప్రాంతాలవాడో కావాలి"

ఈ నిర్ణయాలబాపతు తలా తోకాకూడా తెలియలేదు సుభద్రమ్మకి.

"ఇది మరీ బావుంది ... అయితే యీ పక్కపేటలోనే జరిగే యీ అల్లకల్లోలం చూసి వాడు యీ పేటవాడేననికూడా అనేటట్టువున్నారే! ఇందాకేమో వాడికి మన యిల్లు ఆమాకీ అదీ తెలుసుఅనీ - మీతాత వూళ్ళోళ్ళతేనిసంగ..."

"ఆగు! ఆగు!!" నోట్లోవున్న బీడీముక్క విసరి పుచ్చుకు గిరాటుపెడుతూ భార్యని మాట్లాడనివ్వకుండా హఠాత్తుగా ఆపాడు లింగమూర్తి. సుభద్రమ్మ వంటనే మాట మింగేసి భర్తవేపు తెల్లబోయి చూస్తూ వుండిపోయింది.

"నీ సందేహాలతో యీ సమస్యని యిట్టేపరిష్కరించేశావు. ఇందాకట్నుంచీ అనుమానాలతో అతలాకుతలం అవుతున్న నాకు జ్ఞాననేత్రం ప్రసాదించావు."

లింగమూర్తి భార్యను యీరీతిగా మెచ్చుకొని ఆపైన సూటిగా ప్రశ్నించాడు.

"ఇంతకూ రామి మొగుడు యీ వూరు వచ్చి ఎన్నాళ్లు అయింది?"

సుభద్రమ్మ పెద్ద తెలివిగలది కానిమాట నిజమే—ఏనాడూ అపరాధ పరిశోధక నవలలు చదవని మాటా యధార్థమే. అయినా ఒక్క విషయంమట్టుకు క్షణంలో గ్రహించింది—రామి మొగుడు యీ దొంగ అనే నిర్ణయానికి భర్త లింగమూర్తి వచ్చేశాడు అని.

"మీ అనుమానాలు దొంగలు తోలా... యింతకీ వాడే దొంగ అంటారా?" అమాయకంగా ప్రశ్నించింది సుభద్రమ్మ.

"అందుకు యింకా సందేహమా..." మనో నిశ్చయంతోనూ దృఢ కంఠ స్వరంతోనూ లింగమూర్తి అన్నాడు. జరిగిన సంగతులూ, తోచిన వూహాపోహలూ తూచి చేసిన నిర్ణయం యిది. ఇందులో ఏవీ పొరపాటు పడటానికి సావకాశమే లేదు. మానవుడి మనోనేత్రం తెరుచుకోవాలే గాని ఆపైన సాధ్యంకానిదేంవున్నది? జ్ఞాతం కాకపోయే అజ్ఞానం ఏ వున్నదీ....."ప్రమాణమంతః కరణం ప్రవృత్తయః" అనే దుష్యంత సూక్తిని లింగమూర్తి దృఢంగా నమ్మతాడు. హృదయకుహరం అన్ని మూలల నుంచీ ఒకటే ఒక్కమాట—అపశబ్దరహితంగా, స్ఫుటంగా, స్పష్టంగా "రామి మొగుడు దొంగవెధవ" అంటూ తనంత తాను అప్రయత్నంగా బయటకు వస్తూ వుంటే యిది సత్తా అసత్తా అనుకుంటూ యింకా తమస్సులోనే పడి తపస్సు చేసే తత్త్వం కాదు లింగమూర్తిది. ఇక జాగు చేయకుండా తత్ తమస్సునుండి జ్యోతిర్మయ జగత్తులోకి ప్రవేశించాడు సమస్య సులభంగా విడిపోయింది. కార్యకారణాలూ, సంభవాసంభవాలూ సమన్వయపరుచుకోగా తేలిన తేటతెల్లమయిన సత్యం యిది!

అవును మరి. రామి తమ యింట్లో సంవత్సరంనుంచీ పనిచేస్తూ వుండవచ్చుగాక ...అది ఏనాది మనిషేగదా! తమ యింట్లో

 దొంగ .... లింగమూర్తి 

ప్రవేశించిన మొదట్లో కూతురూ తనూ వుంటున్నట్లు చెప్పిన చెప్పియుండవచ్చు గాక. మరి నాలుగు నెల్లకు పూర్వమేగదా మొగుడదె వచ్చినాడనుచు ఆయమ సంతసమంగ లేదకో! తమ యింటి గుట్టుమట్టులన్నీ రామికన్నా ఎక్కువగా ఎవరికి తెలుస్తవి పైగా సుభద్రమ్మ యిప్పుడు చెప్పిన సంగతులుకూడా విచారిస్తే నిన్నల్లా రామి కొాలు గాలిన పిల్లిలా తిరిగిందిట. రాత్రి 8 గంటలు దాటిన తరువాత వచ్చి "వణ్ణంలోకి పచ్చడి పెట్టించం డమ్మగోరూ" అని అడగటానికి కారణం—అహా! అసలు రావటానికి కారణం ఆమాకే కనుక్కుపోయేటందుకే అయివుంటుంది. తల్లీ పిల్లా తప్ప యిహా

ఇంట్లో మగపురుగంటూ లేదని మొగుడుతో తప్పీలు చెప్పివుంటుంది. వాడికి యింత కన్నా మంచి సమయం మరిహా నెప్పుడు దొరుకుతుంది. రొట్టె విరిగి నేతిలో పడ్డది గదా అనుకుని రామి మొగుడు చోరుడై వంట యింటిలో ప్రవేశించాడనే మాట నిజం...నిశ్చయం! ఆతరువాత జరిగిన సంగతులు సర్వమూ తను సుభద్రమ్మ నోటా వున్నయ్య పంతులు ముఖతః విన్నవేగదా. ఇహ సందేహ మెందుకు, దొంగ వివరం నిశ్చయంగా తేలిపోయింది! అదీగాక పచ్చడి పట్టుకుపోతూ రామి అన్న మాటలూ, నవ్విన నవ్వూ——వాటిలో గర్భితమయివున్న అర్థం యిప్పుడుగా తనకు తెలుస్తూ వుంది.

"దొంగ ఎదవ......పచ్చడిమీద మోజు పడ్డాడు సచ్చినోడు" అనిగదా రామి అన్నదీ. ఆహా రామీ! నువ్వు దాచుకోవా లనుకున్నా నీలోవున్న ఉక్రోషం పట్టలేక గదా ఆ పలుకు పలికావు. నీ మొగుడు వెధవపచ్చడి మెతుకులకు మోజుపడి అన్నానికి పట్టించాడన్నమాట! అందుకనే చేతి చిక్కిన వెండి కంచం దాటిపోయిందనే అక్కసుకొద్దీ ఆడదానివి కాబట్టీ——ధర్మరాజులవారు యిచ్చిన శాపం అంటూ ఒకాటి వుండబట్టీ ఆపె మనసు అదిమి పెట్టుకోలేక సదరు పై మాటలద్వారా అనుకోకుండానే అసలు విషయం బయట పెట్టేశావు! - అనుకున్నాడు లింగమూర్తి.

ఈ ఆలోచనలు అన్నీ సుభద్రమ్మకు తెలియజెప్పటం లింగమూర్తికి సంతోషమే అయినా యివి అన్నీ విని ఆమె నిజమేనని నప్పుదల అయేసరికి 'పక్కా' గంటసేపు పట్టింది.

అయితే యీ సమయంలోనే భర్త లింగమూర్తి భార్య సుభద్రమ్మకు వక వార్నింగు యిచ్చాడు.

"చూడు పిల్లా! అది సాయంత్రం పాచి పనికి వచ్చేవేళా అయింది - రాగానే మెల్లిగా కదలేసి అసలు విషయం బయటకు లాగుతాను. నా నేర్పు చూద్దువుగాని! గాని నువ్వో వెర్రి మాలోకానివి - తొందరపడి మనం గాని మొగుడిని అనుమానిస్తూ వున్నట్టు బయటపెట్టేవు సుమా - కొంపలు అంటుకుపోగలవు!"

ఈ విధంగా లింగమూర్తి ఆమెగారికి "హోరా పానూన్ సావన్ రహో" అనే హెచ్చరిక మాత్రం చేసి సాయంత్రం పాచి పనికి రామి యింకా ఎప్పుడు వస్తుందా అని వెయ్యికళ్ళతో ఎదురుచూస్తూ అలవాటు వున్న తియ్యటి మధ్యాహ్న విశ్రాంతికి స్వస్తిపలికి అల్లా కుర్చీలోనే కూర్చుండి పోయాడు -

సావిట్లో వున్న గోడగడియారం అయిదు పొర్లు గంటలుకొట్టింది. రామి ఆరోజు పనిలోకి వచ్చే సూచనలు ఏమీ కనబడకపోవటంతో లింగమూర్తి తను చేసిన యింత ప్రయత్నమూ వృధాఅయిపోతుందేమోననే బాధతో వున్నాడు. ఇంతవరకూ, రామిని ఏయే ప్రశ్నలు ఏ క్రమంలో వెయ్యాలో తన కంఠస్వరం తత్సమయంలో ఏ విధంగా వుండవలసినదీ, తన కళ్ళు రామి కళ్ళల్లోకి జవాబు వెదుకుతూ ఏ విధంగా చూడవలసినదీ తన మనస్సులోనే వూహించుకుంటూ వున్నాడు లింగమూర్తి - కాకలు తీరిన క్రిమినలు ప్లీడరులా. అయితే తనుపడ్డ యీ శ్రమ అంతా వృధాయేనా? ఆరోజు రామి రాక



# దొంగా.... లింగమూర్తీ



పోవటానికి గల హేతువు ఏమిటి? దీనికీ దొంగతనానికీ ఏమన్నా సంబంధం వున్నదా? అనే మరికొన్ని ప్రశ్నలు ప్రత్యక్షమయాయి...ఈ సమయంలో లింగమూర్తికి ఆలోచించే ఓర్పు తగ్గిపోయింది – ఉత్సాహమూ లేదు. ఒకవేళ రామి తన మొగుడిని తను అనుమానిస్తూ వున్నట్టు పసిగట్టిందా? అహ! అదెలా సంభవమవుతుందీ. తనకూ తన భార్యకు జరిగిన యీ సమాలోచన రామికి ఎట్లా తెలుస్తుంది! అయినా యింకా రామి వచ్చే సమయం దాటిపోలేదు – యింతలో వస్తే రానూవచ్చు. కాక కోతల హడావుడిలో కూలీడబ్బులికి ఆశపడి యీరోజు పాచిపని ఎగగొట్టేసిందా...మరి అయితే వుదయం 10 గంటలదాకా యిటుపక్కలనే వుంటే. ఏమో ఏమన్నా కావచ్చు.

ఈ విధంగా ఆలోచిస్తూ రామి ఆగమనం కొరకు లింగమూర్తి వళ్ళంతా కళ్ళుచేసుకొని నిరీక్షిస్తూనే వున్నాడు. మాటిమాటికీ తలయెత్తి వీధి గుమ్మంవైపు చూస్తూనూ వున్నాడు. ఏమాత్రం అలికిడి తగిలినా "అదుగో రామి రానేవచ్చింది." అనుకొని అటుచూసి దప్పరిస్తూనే వున్నాడు. గోడ గడియారం మరోగంట కొట్టింది. లింగమూర్తి ఓర్పు హద్దు దాటిపోనూ పోయింది. కుర్చీలోనుంచి లేచి నిలబడి నిస్పృహతో పెదవి చప్పరించి అనుకున్నాడు "ఇహ! యీవేళకి రాదు." పోనీ తనే వకమారు రామి యింటికి వెళ్లివస్తే! ఛీ! అదేమంత బావుంటుంది. ఎందుకు వచ్చినట్టు సంజాయిషీ చెప్పుకోవాలి? ఏవీ యిందులో అంత సైద్యం ఏమున్నదీ..."పనిలోకి రాలేదేమే" అని అడగటానికి వచ్చానన వచ్చు. దాని మొగుడుని చూసినట్లూ అవుతుంది...అవును వాడి ముఖారవిందం ఓసారి సందర్శిస్తే తను యిదివరకు వచ్చిన నిర్ణయం తాలూకు నిజానిజాలూ తేలిపోతాయి. ఈ పద్ధతి బాగా సేవున్నది. ఏమన్నా వీలుగా వుంటే ఏవో నాలుగు ప్రశ్నలువేసి రామి మొగుడినే బోల్తా కొట్టించవచ్చు. ఆపైన ఏమిచేస్తే బావుంటుందో దరిమిలా ఆలోచించుకోవచ్చు.

లింగమూర్తి లేచి నిలబడి చొక్కా తొడుక్కుంటూ వుండగా సుభద్రమ్మ అటువచ్చింది. వచ్చిన సుభద్రమ్మ పూరికే వున్నా బావుండిపోను..."చీకటి పడుతుండగా బయలుదేరుతున్నారే ఎక్కడికోనూ?" అని ప్రశ్నవేయటం లింగమూర్తికి చాలా అశుభసూచకంగా – తొలి కబళంలోనే మక్షికా పాతంలా అనిపించింది. అతగాడు చాలా చిరాకుపడ్డాడు.

"వల్లకాట్లోకి – ఏవీ నువ్వూ వస్తావా" అన్నాడు తీక్షణంగా.

సుభద్రమ్మ మరి మాట్లాడలేదు. లింగమూర్తి వాకిలిదాటి బయటకి వెళ్ళినతరువాత మాత్రం "ఈ మగవాళ్లతో ఏది అన్నా తప్పే...ఛీ" అనుకున్నది.

లింగమూర్తి యింటికి దక్షిణంగా రెండు వీధుల అవతల పాకలలో రామి వుంటూ వున్నది...అన్న విషయం లింగమూర్తికి బాగనే తెలుసు! అంటే తన యింటిదగ్గర నుంచి సేరుగా వెళ్ళేటట్టయితే షుమారు మూడు నాలుగు ఫర్లాంగుల దూరం మాత్రం వుంటుంది. అయితే యీ దారిని వెళ్లటం అతగాడికి ఎంతమాత్రం యిష్టంలేదు. ఈ పూరికి లింగమూర్తి పాతకాపు. అతన్ని ఎరగనివారంటూ లేరు. ఏ మిత్రుడు చూసినా – తను ఏనాది గుడిసెలకి వెళ్లడం యీ సమయంలో—ఏమంత సబబుగా వుంటుంది. అందువల్ల కాస్త చుట్టు అయినాసరే "క్లబ్ రోడ్డు"దాకా పోయి అక్కడనుంచి అడ్డంపడి యానాది గుడిసెలమీదుగా రావచ్చు. ఎవరన్నా "ఇటు ఎక్కడికని" అడిగినా "అడ్డతోవంటే యింటికి పోతున్నాను—చీకటి పడుతోంది వస్తానని" తప్పుకోవచ్చు—అనుకొని లింగమూర్తి మామూలు త్రోవ వదిలేసి చుట్టు తిరిగి క్లబ్ రోడ్డుమీదికి వచ్చేశాడు, ఆపైన మెల్లిగా నాలుగు మూలలా చూసుకొని ఎవరూ ఎరిగినవాళ్లు లేరని నిర్ధారణ అయిన పిదప రోడ్డు దిగి యానాది గుడిసెలవైపుకు మళ్లాడు.

ఇటునుంచి అయితే కేవలం రామి గుడిసె తాలూకు వెనకప్రక్కే కనపడుతుంది. లింగమూర్తి చేతినివున్న "వాచి" చూసుకున్నాడు. 5-45 నిమిషాలు అయింది. శీతాకాలపుపొద్దుకావటంమూలంగా చీకటి పడుతోంది. గూడెంలో జనసంచారం ఏమీ లేదు. లింగమూర్తి గుడిసె వెనకవేపే నిలబడి పరిశీలనగా ఆ గుడిసెవంక చూశాడు.

అయితే యీ సమయంలోనే గుడిసెలోనుంచి రామి మాటలు విని హఠాత్తుగా ఎగిరిపడ్డాడు లింగమూర్తి.

"ఎల్లానచ్చేదంట నీతో ... జాగర్తరో దేవుడో అని సెప్పనేసెప్పితిని." మగకంఠం అంటోంది. "ఏటే జాగర్త ... ఓపక్క సత్తుంటే ఏటి పట్టుకు నేది"

"ఆ ఒకప్పుడు ఎలగబెట్టావూ...ఇప్పుడు అగ్గడతావు" అంటోంది రామి. అదుగో రామి అవాకులూ చవాకులూ పేస్తూనేవుంది మొగుణ్ణి. అందుకేగావల్ను యీపూట పనిలోకికూడా రాకుండా మానేసింది!

గుడిసెలో మరి మాటలు వినబడకపోవటంతో అటు తిరిగివచ్చి

"రామీ" అని కేకేశాడు లింగమూర్తి.

రామి ఆశ్చర్యపోయింది బయటికివచ్చి!

"ఏటిబాబూ యీయేలప్పుడు – "

"అహ! ఏమీలేదు లాస్టుబస్‌కు పూరు పోతున్నాను పనిమీద...యీరాత్రిరి కాస్త యింటిదగ్గర సాయంపడుకుంటావేమో కనుక్కుందామని వచ్చాను" తడుముకోకుండా అబద్ధం చెప్పేశాడు లింగమూర్తి.

"అయ్యో దానికేటి బాబుగోరూ ... అయితేనాగులుకుజరంబాబూ"అన్నదిరామి. నాగులు అంటే రామిమొగుడు అన్నమాట.

"ఏదీవాడు – చూడనీ" అంటూనే లింగమూర్తి గుడిసెలోకి పోయాడు – తనుయింట ప్రవేశించి పారిపోయివచ్చిన ముచ్చును చూసేనిమిత్తం.

అయితే ఆ గుడిసెలో లింగమూర్తి ఏమి చూశాడూ? ఆసంజెచీకటిలో ఆ గుడిసెలో మూలాల ఒకవ్యక్తి ... బహుశః నాగులే అయివుంటాడు కూర్చునివున్నాడు! కాదు పడుకు నేవున్నాడు ... ఏమో పడుకునే వున్నాడో కూర్చునే వున్నాడో ఆ గుడ్డి వెలుతురులో నిశ్చయంగా చెప్పటం కష్టం – ఒక్క విషయంమట్టుకు నిశ్చయంగా చెప్పవచ్చు...అమూల ఆ చీకట్లో మూలుగుతున్న వ్యక్తికి రెండు కాళ్లూ లేవు! ఆ వ్యక్తి తొడలమీదే ఆధారపడి వుండటంవల్లనే అతను కూర్చున్నాడో పడుకున్నాడో చెప్పటం కష్టం!

లింగమూర్తి నిశ్చేష్టుడు అయాడు. రామి యీ విషయం గ్రహించివుంటుంది.

"పోయిన ఏడాది రేలుకిందపడి కాళ్ళు రెండూ పోయినయ్ అయ్యా." అన్నది రామి.






## 24

దొంగనోట్లు ఎండబెట్టి మళ్లీ తోలుసంచీలో పదిలంచేసి వరదరాజు ఆ ముగ్గురికోసం సాయంత్రందాకా చూశాడారోజు. అవి అలాగే తన దగ్గరవుండటం ప్రమాదమని అతనికి తెలుసు. కాని అలా భయపడ్డం అతనికి చాదస్తం అనిపించింది. ఆవేళ సాయంత్రం వాతావరణం ప్రశాంతంగా వుంది. సాయంత్రంవరకూ ఎండకాసింది; సాయంత్రపు పండు బంగారు ఛాయలు విజయవాడ పట్నంమీద ప్రసరిస్తున్నాయి. కృష్ణానది ఉధృత ప్రవాహంమీద ఎండ వింతగా భయం కొల్పుతూంది.

సాయం సంధ్య దుర్గుడికి వెనక క్రుంగేవేళ, ఎర్రని కిరణాల ముందు కొండచీకటిగా గంభీరంగా ఎలక్ట్రిక్ లైట్ల తోరణాలతో నిలబడివున్న వేళ వరదరాజు బ్రాకెట్ కంపెనీ దగ్గరకొచ్చాడు.

అప్పటికే కొట్టుదగ్గర బోలెడుమంది చేరారు. అందరూ ఒకరికొకరు సుపరిచితులు. కొట్టు అతను బ్రాకెట్లు ముమ్మరం తగ్గినందువల్ల గాబోలు, అప్పుడే వొచ్చిన స్థానిక దినపత్రికను పెద్దగా చదువుతున్నాడు.

వరదరాజు కొట్టుముందు నుల్చుని నిశ్చలంగా సిగరెట్టు కాలుస్తూ వింటున్నవాడల్లా ఒక్కరవ్వ ఉలిక్కిపడి ఆసక్తిగా వార్త వినసాగాడు.

"దొంగనోట్ల తయారీ—యంత్రంతో సహా, ముగ్గురి అరెస్టు"

"ఏందది? ఏ వూళ్ళో?—కొస్త పెద్దగా చదవరాదంట్రా?" అన్నాడు వరదరాజు కొట్టతని వేపు తిరిగి.

కొట్టతను చదవసాగాడు. "ఇవ్వాళ మధ్యాహ్నం సుమారు రెండుగంటలకు పోలీసులు, చాలాకాలంగా, వెతుకుతున్న ఇంజనీరు రాయలసీమ నివాసీ అయిన నరసింహారెడ్డిని, అతని అనుచరులిద్దర్ని, దొంగనోట్లు — తయారుచెయ్యటాని కుపయోగిస్తుందని అనుమానింపబడుతున్న యంత్రంతో సహా పట్టుకున్నారు. వీరు ముగ్గుర్నీ చాలాకాలంగా సి. ఐ. డి. శాఖవారు వెంబడిస్తున్నారు. అతిచాకచక్యంగా, జగ్గయ్యపేటరోడ్డుమీద తాటిబుళ్ళలోవున్న పాడుపడ్డ కొంపలో ఈ ముద్దాయిలు దొరికారు."

వరదరాజు కెందుకో కొంచెం చలేసినట్టయింది; అతనిబుర్ర రెండునిమిషాలపాటు పనిచెయ్యలేదు. అప్పుడే అక్కడికివచ్చి అతనిపక్కనే నుల్చునివున్న ఏడుకొండలు, "ఏందిరా ఇది!..." అన్నాడు, కొంచెం గొణుగుడుగా.

వరదరాజు అతన్ని ఉరిమిచూశాడు. తర్వాత "నాతో రారా;" అంటూ స్టేషన్‌వేపు నడవసాగాడు తొందర తొందరగా.

"అయితే అళ్ళంతా దొరికిపోయారంటా?" అని ప్రశ్నించాడు ఏడుకొండలు.

"అవేగా, పేపరులో రాశారు! మరేం ఫర్వాలేదులేరా భయపడి సావకు...సరేగాని! ఇప్పుడు ఎంత టైమయిందిరా?" అన్నాడు వరదరాజు, స్టేషను బ్రిడ్జి మెట్లెక్కుతూ.

ఏడుకొండలు ఉజ్జాయింపుగా, "ఆరున్నరయిందేమోరా" అన్నాడు, తానూ తొందరగా నడుస్తూ.

వరదరాజు ఒకక్షణం మెట్లమీద నిలబడిపోయినాడు. ఏవో తీవ్రమైన ఆలోచనలు తరువాత ఏదో దృఢసంకల్పం అతని ముఖంలో ప్రతిబింబించాయి.

"వొరే! ఈ రూపాయి తీసుకో" అని జేబులోంచి రూపాయి కాయితం ఇచ్చి, "సరాసరి, అంజయ్య ఇంటికిపో. తోలుసంచీ తీసుకో. రాను పోను వెంకడిరిక్షా మాట్లాడుకో. వెంటనే తిరిగి ఈడకిరా. నేను ఈలోగా టిక్కెట్లుకొని అట్టే పెడతా" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టుగా.

"టిక్కెట్లూ! యాడికిరోవ్?"

"మదరాసుకిరా! మెయిలు తొమ్మిదిగంటలకిగదరా? ... వెళ్ళు వెళ్ళు...ఊఁ. ఇక్కడున్నట్టు రావాల!" అన్నాడు వరదరాజు తను బుకింగ్‌దగ్గరకిపోతూ.

ఏడుకొండలు బెదురుచూపులు చూస్తూ, గవర్నర్‌పేట వేపు వెళ్లాడు తొందరగా.

వరదరాజు జేబులోంచి, రెండు పదికాయితాల్ని తీసి నిర్లక్ష్యంగా, మదరాసువేపు వెళ్లే టిక్కెట్లిచ్చే బుకింగ్ కిటికీ దగ్గరకెళ్ళి లోపలకిస్తూ, "రెండు మద్రాసు మూడోక్లాసు టిక్కెట్లియ్యవయ్యా?" అన్నాడు.

బుకింగ్‌క్లర్కు, "పాసింజరుకా, మెయిల్‌కా" అని అడిగాడు.

"మెయిల్‌కే"

టకటక రెండు టిక్కెట్లూ మిగతాడబ్బులూ వొచ్చిపడ్డాయి. వరదరాజు ఒకసారికి రెండుసార్లు చుట్టూచూస్తూ మళ్లీ తిరిగి బ్రిడ్జి మెట్లదగ్గరకెళ్లి నుల్చున్నాడు; పాసెంజర్ హాలంతా మహాసందడిగా వుంది. అది అన్ని వేపులకీ రైళ్లుబయల్దేరే వేళ; జనంతొక్కిసలాడుతున్నారు. అక్కడక్కడ పోలీసులు తిరుగుతున్నారు.

వరదరాజు ఒక్కొక్క పోలీసునే పరీక్షగా చూస్తున్నాడు. తనకి బాగా పరిచయస్థు డొకతనుండాలే! ఆ పొడుగాటతనే... ఎవడో అనాథుడైన కుర్రాణ్ని దబాయిస్తున్నాడు బైటికి పొమ్మని గాబోలు! మెల్లిగా కదిలిస్తే సంగతి సందర్భాలు తెలుస్తాయేమో!

వరదరాజు కటకటాలదగ్గర నిలబడ్డ పోలీసులదగ్గర కెళ్ళాడు. "దండమయ్యా!" అన్నాడు కొంత వినయంగా.

పోలీసు, వర్రాణ్ణి బైటికి పంపేసి, నెత్తిమీద టోపీ చేత్తో పట్టుకుని, "ఏంరా వరదా! ఎక్కడికి వెళ్తున్నావు!?" అని ప్రశ్నించాడు.

"ఎక్కడికీ లేదండి...మరి, పేపర్లో......" అని ఆరంభించాడు.

పోలీసు నిర్లక్ష్యంగా "పేపర్లో? ఏంటికి?..." అని ప్రశ్నించాడు.

"ఆ ఏంలేదు.. అకేందో దొంగనోట్లంటనే...ఎవళ్లనో పట్టుకున్నారంట. వూరంతా గోలగా వుంది!" అన్నాడు వరదరాజు.

"ఆ! ఏందో! మనకేం తెలుసు! పెద్ద ఆఫీసర్ల వ్యవహారమది!

మనదాకా రాదు. అయినా...మనకెందుకు పోనిద్దూ! పసివ జిడ్డు. అదేంది, అన్నవాణ్ణల్లా జైల్లో పెడతారు, ఏమీ తెలియకపోయినా సరే" అన్నాడు పోలీసు.

"అంతే లెండయ్యా!" అంటూ వరదరాజు, "రండి, టీ తాగుదాం" అన్నాడు.

పోలీసు ముందూ, వరదరాజు వెనకా నడిచి, హోటల్ కెళ్ళారు. రెండు టీ తాగారు. పోలీసు శలవు పుచ్చుకున్నాడు.

వరదరాజు తిరిగి బ్రిడ్జిదగ్గరకొచ్చాడు. ఏడుకొండలు పక్క చుట్టతో సహా మెట్లు దిగుతున్నాడు. పాసెంజర్ షెడ్డులో పెద్ద గడియారంలో ఏడున్నరయింది.

వరదరాజు, "ఏమిరా! తెచ్చినావూ?" అని అడిగాడు.

ఏడుకొండలు తలవూపాడు.

"పద అయితే. ప్లాట్ ఫారంమీద కూచుందాం" అంటూ వరదరాజు ప్లాట్ ఫారం చివరికి వెళ్ళాడు. ఇద్దరూ ప్లాట్ ఫారంమీద లైట్ల వెలుగు తక్కువగా వున్న ఒకచోట కూర్చున్నారు.

"అయితే మదరాసుకే నన్నమాట!" అన్నాడు ఏడుకొండలు.

"అవునురా! ఏం ఇంకా వొణుకుతున్నావు! నీ మొహం చూస్తేనే చాలు..." అన్నాడు వరదరాజు వ్యంగంగా.

"లేదురా! నువ్వూరికే అంటావుగాని, ఎవడి కుండదేం ఆపాటి భయం."

"ఏడ్చావులేరా వెధవా. ఆ పక్క చుట్ట నాచేతి కియ్యి" అని పక్క చుట్ట తీసుకుని కింద పడేసి దానిమీద కూర్చున్నాడు వరదరాజు.

గంటకి మెయిల్ వొచ్చింది. ఇద్దరూ మౌనంగా మెయిల్ ఎక్కారు.

## 25

కార్యం మూడురోజులూ శేషాద్రిరావుగారు పైకంకోసం రంగయ్యగారితో ఘర్షణ పడుతూనే వున్నారు. ఆవేళ, నాలుగోరోజు. తెనాలి తిరిగి వెళ్ళేరోజు. రాత్రి పాసెంజర్ కి ప్రయాణం. ఈ మూడురాత్రులూ జయ మొగుడు దగ్గరికి రావటంతోటే స్పృహతప్పి పడిపోతూనే వుంది.

దీన్నిగురించి, రమణమ్మ తమ్ముడితో మాట్లాడి ఒక నిశ్చయానికి వొచ్చింది. "తెనాలి వెళ్ళేవరకూ, ఈ సంగతి నాన్నకీ అమ్మకీ తెలియనివ్వకు. అక్కడికి పోయింతర్వాత తెలిస్తే, ఏదో వైద్యం చేయిస్తారు. ఇక్కడే తెలిస్తే, ఈ డబ్బు రానికోపంమీద ఇదో వంకతో ఆ పిల్లని నష్టేటముంచుతారు" అంది ఆమె.

తమ్ముడు, "నిజమేనే అక్కా. అయితే నాకు తెలీక అడుగుతాను. మామగారిదగ్గర పైకం లేదంటావా?" అన్నాడు సంశయంగా.

అక్క కొంచెం స్వరం తగ్గించి, "అంతేరా, ఉంటే ఇచ్చేయరా ఏం? అప్పుడు పైకం దొరగ్గానే పంపించెయ్యలేదూ?" అన్నది.

"అవునవును....ఇప్పుడు...పైకం ఇవ్వలేదుగదా, ఏం జరుగుతుందంటావు?" అని ప్రశ్నించాడు తమ్ముడు.

"ఏం జరుగుతుందో చూడరాదుట్రా. రాత్రిబండికి వెళ్ళాలి గదా ఎటుతిరిగి? ఇప్పుడేమో మూడుగంటలయింది. ఇంతవరకూ పైకం రాలేదంటున్నాడు మీ మామగారు." అంటున్నదల్లా, బైట గోల విని "అదిగో మళ్ళీ నాన్న మొదలెట్టాడురా, ఏదో పోతా. నువ్వూరా." అంటూ బైటికిపోయింది.

మూడుగంటల ఎండయినా తీక్షణంగాలేదు. చల్లనిగాలి వీస్తోంది. దూది పింజల్లా వెలిమబ్బులు తేలుతున్నాయి ఆకాశంలో.

శేషాద్రిరావుగారు, "మంచి పెద్దమనిషి వే! కార్యానికి నిస్తానని. ఇదిగో అనీ, అదిగో నని, పని గడుపుకుంటావుటయ్యా! ఈపూట ఐదుగంటలకి దంబిడీలతో సహా ఇచ్చారా సరే. లేదా, మీ పిల్ల మీ దగ్గిరే వుంటుంది!" అన్నాడు నిక్కచ్చిగా.

రంగయ్యగారికి కళ్ళనీళ్ళ పర్యంత మౌతోంది. "ఎలాగైనా ఇంకోరోజో రెండురోజులో వ్యవధి ఇస్తే..." అన్నాడు. అబద్ధం అని తెలుసాయనకి. కాని అబద్ధమాడక తప్పదు. అమ్మాయి యొక్క జీవితం తన జయాపజయాలమీదే ఆధారపడివుందాయెను...

"ఇంకోరోజా! మంచి సంగతే! విన్నావుటే" అన్నాడు ప్లీడరుగారు భార్యవంక తిరిగి.

ఈ సమయానికి త్రయంబకరావు గది వాకిలిదగ్గరకొచ్చి నిలబడ్డాడు.

వరలక్ష్మమ్మగారు జానకమ్మ చేతులుపట్టుకుని, "వొదినగారూ, ఏదో ఆలస్యమైంది...రెండురోజుల్లో పంపిస్తాం. అమ్మాయిని తీసుకెళ్ళండి. ఇవ్వాళ చాలా మంచిది..." అంటోంది జాలిగొల్పేట్టు.

జానకమ్మ చేతులు విదిలించుకుని మొహం మటమటలాడించుకుంటూ నిలబడ్డది.

ఈ సమయానికి జయ పూజగదిలో మందిరందగ్గిర మోకాళ్ళమీద తల ఆనించుకుని కూర్చునివుంది, ఈ సంభాషణంతా వింటూ. సదానందం ఇంట్లో లేడు. ఈగోల భరించలేక బైటికి పోయినాడు. తను పరిష్కరించలేని గణితసూత్రంతో విసిగిపోయినవిద్యార్థిలా వుందతనిస్థితి.

శేషాద్రిరావుగారు మండిపోతున్నాడు. "అదేమిటయ్యా! అలా నిలబడ్డావు! అనుకున్న కట్నం పెళ్ళినాడే పుచ్చుకోవల్సింది. ఏదో ఇబ్బందులంటూ అందరికీ వస్తాయని, పస్తాయించి వూరుకుంటే అట్లా అట్లా రెండేళ్ళు గడిపేశారు; మెల్లిగా ఆమాటా ఈమాటా చెప్పి కార్యం నాడిస్తామని, పని గడిచింతర్వాత ఇదా చేసేపని! పిల్లాడు వల్లోపడ్డాడుగదా అనుకుంటున్నారేమో! డబ్బు ఈకు కొనతెచ్చి నాకియ్యకపోతే, ఇంక మీకూ మాకూ సరి! ఏమనుకుంటున్నారు, మీ వృద్ధశంలో! శేషాద్రి అంటే అంత తేలిగ్గా వుందా!" అన్నాడు, తన పూబకాయాన్ని ఈ వుపన్యాసంతో బహు శ్రమపెట్టడంవల్ల రొప్పుతూ.

రంగయ్యగారు, "బావగారలా కోప్పడగూడదు. డబ్బు అందలేదు...అందితే ఇవ్వకపోయానా? మీరడగాలా? నాకు లేదా ఆబాధ్యత? అమ్మాయి మొహంచూసి ఈరోజుకి క్షమించండి..." అన్నాడు చాలా వ్యసతో.

శేషాద్రిరావు, వొరేయ్ అబ్బాయి" అని కేకేశాడు కోపంతోటి.

అబ్బాయి, గడపమీదనుల్చున్నవాడల్లా, ఉలిక్కిపడి, ముందుకువచ్చి హాల్లో నిలబడ్డాడు అంగ్రప్రక్క న.

"ఏమిటవ ఏమిటరా! పోయి జట్కా పిల్చుకురా. రాత్రిబండి దాకా ఎందుకు? ఇప్పుడే ఓబండివుంది. పోదాంపద—ఊఁ. వెళ్ళు" అన్నాడు అదిరిస్తూ.

కొడుకు ఒక్క నిమిషం కదలలేదు. ఏదో తొందరతొందరగా ఆలోచిస్తున్నాడుగాబోలు, "నాన్నా!" అని ప్రారంభించాడు మెల్లిగా.

"ఏమిటిరా నాన్నా?" అంది తల్లి కోపంగానే. ఈవేడిలో

వేడిగా వెళ్ళకపోతే మళ్ళీ మొగుడెక్కడ మొత్తకొచ్చిపోతాడోనని ఆమెభయం. "పోయి బండి తీసుకురారా" అంది ఆజ్ఞాపిస్తూ.

"అదిగాదే అమ్మా" అన్నాడు కొడుకు ఇంకా నిదానంగా.

ఈ సంభాషణని అత్యంతశ్రద్ధతో ఆదుర్దాతో వింటున్న రమణమ్మ లోగడపలో నిలబడి తమ్ముడికేసి చూస్తోంది. తమ్ముడెక్కడ పప్పులో కాలేస్తాడో అని ఆమె గుండెలు దడదడ లాడుతున్నాయి.

శేషాద్రిరావుగారు 'అబ్బాయి' అని పొలికేక పెట్టినప్పుడు జయ తలెత్తింది. ఆమెకంతా అయోమయంగా వుంది. నీరసంగా బలహీనంగావుం దామెకి.

"ఏమిట్రా అదేమిటో తెమల్చరా!" అంది తల్లి కోపంతో.

"కొడుకు నీళ్లు నములుతూ. "నాన్నా, మరి..." అన్నాడు గొంతులోంచి మాటలు పెగలడంలేదు.

తండ్రికి ఇది కొంత అయోమయంగానే వుంది. "ఏమిటది?" అని ప్రశ్నించాడాయన: "రైలుకి వేళవుతున్నది" అన్నాడు రిస్టువాచీవంక చూస్తూ.

"మరి, మీ కోడలు రాదా మనతోటి?" అని ప్రశ్నించాడబ్బాయి, అమాయకమైన మొహం పెట్టి.

అక్కడ నిలబడివున్న వారందరి మధ్యా బాంబు ఏదో బద్దలైనట్టనిపించింది. రంగయ్యగారు అయోమయంగానూ, శేషాద్రిరావూ, ఆయన భార్యా ఆశ్చర్యంతోటీ చూస్తున్నారు త్రయంబకరావువంక.

శేషాద్రిరావుగారు ఎంత ఆశ్చర్యపడ్డప్పటికీ ప్లీడరు గనక వెంటనే కోలుకున్నాడు. "రాదురా! ఎట్లా తీసుకెళ్తా మనుకున్నావు? మీ మామ మనకియ్యాల్సిన ఐదొందలు ఇస్తేనే తీసుకెళ్తాం నీ పెళ్లాన్ని. అదేమో జరగదు. ఇంకా మనం ఇక్కడ వుండడం ఎందుకు? అందుకని వెళ్దామంటున్నాను. పద. పద. జట్కా పిల్చుకురా" అన్నాడు, వివరంగా విడమర్చి చెప్పి.

బైట సన్నని జల్లు ప్రారంభమైంది. ఐదునిమిషాల్లో వాన అందుకుంది. చూరునించి వర్షపుధారలు కారుతున్నాయి. చల్లని గాలి వీస్తోంది.

"అదా సంగతి! ఐతే—ఇంకా పైకం ఇవ్వనేలేదన్నమాట!" అన్నాడు త్రయంబకరావు కాఠిన్యం వుట్టిపడే గొంతుతో. పక్కకి తిరిగి మామగారివేపు చూశాడు.

లోపల్నించి వింటున్న రమణమ్మకి గుండెలు జల్లుమన్నయ్. ఇదేమిటి! వీడూ అమ్మా నాన్నా వేపే చేరాడేమి ఖర్మ! అనుకుంటోంది ఆమె.

"లేదురా నాయనా! లేదు. అదేగా ఈ మూడురోజుల్నించీ తగాదా! ఇంక మన కీసంబంధం అక్ఖర్లేదురా! పోదాం పద" అంది తల్లి.

"అట్లా అనకండి వదినా" అంటూ వరలక్ష్మమ్మగారు, జానకమ్మ చేతులు పట్టుకుంది దీనంగా.

ఇదంతా చూశాడు త్రయంబకరావు. "నాన్నా, అదేమిటి? మనం డబ్బా తీసుకోకుండా పిల్లనూ ఇక్కడే వొదిలేసి వెళ్ళటమా? తెనాలి పోతే నలుగురూ ఏమంటారు?...మీరు వెళ్లండి నాన్నా... నే నిక్కడేవుండి రేపో ఎల్లుండో ఆ డబ్బునూ పిల్లనూ తీసుకుని వస్తాగా! వీళ్లని ఇట్లాగే వొదిలేస్తే లాభంలేదు" అన్నాడు కొంత సీరియస్ గా.

శేషాద్రిరావుగారికీ జానకమ్మకీ మొదట కొడుకేమంటున్నాడో అర్థం కాలేదు. రంగయ్యగారు ఈ సలహాలో కొంత ఊపిరి తీసుకున్నాడు. వరలక్ష్మమ్మగారు అల్లుడి ఉద్దేశం ఏమిటో ఆలోచిస్తోంది.

లోపల రమణమ్మకి తమ్ముడి ఎత్తు వెంటనే అర్థమై చాలా సంతోషం కలిగింది. "భలే..." అనుకుం దామె.

శేషాద్రిరావుగారి వకీల్ బుర్రకి రెండు సెకండ్లలోనే ఈ సలహాలో వున్న ప్రమాదం మెరుపులా స్ఫురించింది. అమ్మయ్యో! వీణ్ణి మనం లేకండా ఈ యింట్లో వొదిలివెళ్లడమే! ఇంకేమన్నా వుందీ! కుర్రాడు మళ్ళీ తమకి దక్కుతాడా?" అని ఆలోచించుకున్నాడాయన.

"పోనీ అట్లాగే చెయ్యి..." అనబోతోంది, ప్లీడరుగారి భార్య, ఇంతలో ప్లీడరుగారు చప్పున అందుకుని, "నోరుముయ్యవే..." అంటూ రంగయ్యగారివేపు తిరిగి, "ఈ పూట కీ పైకం అందదన్న మాటేగాదు?" అని ప్రశ్నించాడు రోషంతో.

రంగయ్యగారు మౌనంగా వూరుకున్నాడు ఏమనాలో తోచక.

త్రయంబకరావు అందుకున్నాడు; "కనపట్టంలేదు నాన్నా, ఇంకా వేరే అడగాలా ఏం?" అన్నాడు నమ్రతగానే. అతని మొహంలో ఏ భావమూ వ్యక్తం కావటంలేదు.

ప్లీడరుగారికి ఏమీ తోచటంలేదు; ఎలా ఈ సమస్యను విడదియ్యడం? కొడుకు ఏమీ తెలియని సన్యాసి; వాడి కిప్పుడు తను ఏం చెప్పినా అర్థమైచావదు. మొండికేసి ఇక్కడే వుండి పోతాడు...ఇది కొంగుదారి...మరి?...ఆయన కోర్టులో వాదం చేసేప్పుడు కూడా, ఎంత కష్టమైన కేసులోనూ ఇంత బాధపడి ఎరగడు. కాని ఎంతయినా ప్లీడరాయెను! ఇదికాదు వరస. కోడల్ని గూడా తీసుకెళ్ళ....అంతే. ఆపైన ఆయనేమీ ఆలోచించ దల్చలేదు.

"పదరా, అబ్బాయి. పోయి సుబ్బండి మాట్లాడుకురా." అన్నాడు.

త్రయంబకరావు నిలబడే వున్నాడింకా సందేహం చెరగని మొహంతో.

ప్లీడరుగారు కొడుకును అర్థంచేసుకున్నాడు. ఆయన వియ్యంకుడివేపు తిరిగి, కొంచెం కసి తీర్చుకునే స్వరంలో, "పిల్లనూ మాతో తీసుకెళ్తామండి. ఈ బండికే వెళ్తాం. రేపో మాపో పైకం చూసి పంపించండి. లేదా—మీ యిష్టం—పంపించకపోయినా ఫర్వాలేదు. తర్వాత వ్యవహారం తర్వాత చూసుకుంటాం" అన్నాడు.

త్రయంబకరావు ఒక్కనిమిషంగూడా నిల్వలేదక్కడ. గబుక్కున బైటికి వెళ్ళిపోయాడు.

రంగయ్యగారిని ఈ ఆకస్మికమైన ప్రతిపాదన విభ్రాంతిలో ముంచింది. అయితే వియ్యంకుని మాటల్లో ధ్వనిస్తున్న కసి రంగయ్యగారికి నూటిగా తెలుస్తూనే వుంది; ఇప్పుడు పిల్లను పంపించటం మంచిదే...కాని త్వరలోనే డబ్బుకూడా పంపెయ్యాలి. లేదా, అమ్మాయిని వాళ్ళు ఎన్నిబాధలైనా పెడతారు...అమ్మాయికి అత్తవారిల్లు నరకం అవుతుంది—ఈ సమస్యలో పడిపోయినా డాయన.

సరిగ్గా ఇట్లాగే గాకపోయినా, ఇంచుమించుగా ఇలాగే ఆలోచిస్తోంది రంగయ్యగారి భార్య. లోపలనుంచుని వింటున్న రమణమ్మ ఒక్కసారి బరువుగా శ్వాసపీల్చి గుండె తేలిక పర్చుకుంది. ఏదో బరువు దించేసుకున్నట్టయిుం దామెకి.

బైట వానలోనే జట్కా ఆగిన చప్పుడైంది. చినుకులలో తడిసిన మొహం హేండ్ కర్చీఫ్ తో తుడుచుకుంటూ త్రయంబకరావు లోపలికి వచ్చిపడ్డాడు. "బండి వొచ్చిందినాన్నా" అన్నాడు.

"ఏమండి బావగారూ! అమ్మాయి సిద్ధంగావుందా? పిలవండి. ఊఁ...ఊఁ తొరగా; బండికి వేళయింది, ఎక్కువ ఆలస్యం లేదు..." అన్నాడు ప్లీడరుగారు.

వరలక్ష్మమ్మగారికి కాళ్ళాడ్డంలేదు. ఇప్పటికిప్పుడు ఎట్లా ప్రయాణానికి సిద్ధంచెయ్యటం? కాదంటే కోపంవొచ్చి అసలు తీసుకెళ్లరేమో? ఆమె మెల్లిగా "రాత్రిబండికి వెళ్లగూడదా వొదినా? భోంచేసి పోవచ్చుగా..." అన్నది.



# అపస్వరాలు



"ఏమీ అక్కర్లేదు. ఇంకో క్షణంగూడా ఇక్కడ వుండటానికి వీల్లేదు. ఒరే అబ్బాయి, పెట్టె పక్కా తీసుకుపోయి బండిలో పడెయ్యరా" అన్నాడు ప్లీడరుగారు, వాకిలి వేపు కదుల్తూ.

రంగయ్యగారికి తోచీతోచని స్థితి ఏర్పడ్డది. ఆయన ఒక్క నిమిషం తీవ్రమైనసంక్షోభంలో పడి తేరుకున్నాడు. భార్యవేపు తిరిగి, "అమ్మాయిని తీసుకురా. పెట్టె అదీ నువ్వే పట్టుకురా సర్ది. వెళ్లు. పో" అన్నాడు.

వరలక్ష్మమ్మగారు రెండో మాట మాట్లాడకండా లోపలికి వెళ్లింది. ప్లీడరుగారు చేతిగడియారంవంక చూస్తున్నాడు. త్రయంబకరావు పెట్టెలూ పక్కచుట్టా తీసుకొస్తావుంటే రంగయ్యగారల్లే వాటిన్ని తాను అందుకోబోయ్యాడు. అల్లుడు, కొంచెం నమ్రతగా, "నేనే తీసుకొస్తాలెండి. పెద్దవారు మీకెందుకు శ్రమ" అంటూ గబగబ తీసుకెళ్లి బండిలో పడేశాడు. బండివాడు, "యాందండి, బండివేళవుతాంది. రండి" అంటున్నాడు.

లోపల వరలక్ష్మమ్మగారు ఐదంటే ఐదేనిమిషాల్లో చీరెలు వస్త్రాలన్నీ పెట్టెలో సర్దింది. పూజలగదిలో కూర్చున్న కూతుర్ని ఆపాళంగా, లేవతీసి, "రా అమ్మా. వెళ్దువుగాని" అంటూ బైటికి తీసుకొచ్చింది. కూతురుతో ఏదో మాట్లాడాలని ఎంతో దుగ్ధ ఉన్నా దారుణంగా అణిచేసుకుంటోంది. కూతురు పెట్టెని రంగయ్యగారు తీసుకెళ్ళి జట్కాలో పెట్టాడు.

ప్లీడరుగారూ జానకమ్మ ఒక్కమాట మాట్లాడకుండా బైటికి నడవసాగారు. వాళ్ల వెనకాలే త్రయంబకరావు. జయకి అయోమయస్థితి వొదిలిపోయింది. ఆమె మనస్సులోని భారం ఒక్కసారి బ్రద్దలైనట్టు వెక్కి వెక్కి ఏడవసాగింది.

వరలక్ష్మమ్మగారు ఆమెను పొదివిపట్టుకుని, "ఏడవకమ్మా! ఏమీ ఫర్వాలేదు; తెనాలనగా ఎంత? నాన్నో అన్నయ్యో వారానికి పదిరోజులీ వొచ్చి చూసి వస్తుంటారు. దిగులుపడకు తల్లీ. వెళ్ళిరా. వెళ్ళగానే వుత్తరం రాయి" అంది. అప్పటికే అందరూ వాకిలిదగ్గిర కొచ్చేశారు.

రంగయ్యగారు వెనక నిలబడ్డాడు. ఆయన నోటివెంట ఒక్క మాట రావటంలేదు. జయ తల్లిమీదనించి చూపును తండ్రిమీదికి మరల్చింది. "నాన్నా! వెళ్ళొస్తా" అంటూ వొచ్చి ఆయనకి నమస్కరించి లేచింది. రంగయ్యగారు, ఆమెని దీవిస్తూ, "నాకొక్కటే దిగులమ్మా! ఇంక భాగవతం రాయటం కొనసాగదమ్మా!...... వెళ్లిరా! ఏది ఎంతవరకు ప్రాప్తమో అంతవరకేగదా!......" అన్నాడు. జయకి భాగవతం పేరువినగానే దుఃఖం ఇంకా ఎక్కువైంది. అయితే మింగేసుకుంది.

ప్లీడరూ, జానకమ్మా, రమణమ్మా ముగ్గురూ జట్కాలో ఎక్కి కూచున్నారు. ప్లీడరుగారు అరుస్తున్నాడు. రంగయ్యగారు, జయని జట్కా ఎక్కించి ప్లీడరుగారితో "అమ్మాయిని మీ కప్పగిస్తున్నాను. ఇక మీ అమ్మాయే" అనిమాత్రం అన్నాడు. ప్లీడరుగారొక్కమాటా మాట్లాడలేదు. చివరికి త్రయంబకరావు బండి ఎక్కాడు బరువుగా కదిలింది.

వర్షం జోరున కురవసాగింది. మబ్బులు దట్టంగా అలుముకున్నాయి. రోడ్డంతా కాలవలా నీళ్లు ప్రవహిస్తున్నాయి. రంగయ్యగారు వానలో తడుస్తున్న ధ్యాసే లేకుండా వెళ్తోన్న బండికేసి చూస్తూ వీధిలో నిలబడిపోయాడు. ఆయన వెనకాలే గడపదగ్గిర కళ్లనిండా నీళ్లతో వరలక్ష్మమ్మగారు నిలబడి చూస్తోంది.

బండి వేగంగా పరిగెత్తి సందుమలుపు తిరిగింది. ఆ మలుపు దగ్గిరే సదానందం బండికి ఎదురైనాడు. తలొంచుకువొస్తున్న వాడల్లా బండిని తప్పుకుంటూ బండిలో చెల్లెల్ని చూశాడు. జయ కూడా అతన్ని ఒక్క తృటికాలంపాటు చూసింది. చెయ్యెత్తి ఊపింది, —వెళ్తున్నా అన్నట్టు. సదానందం నిలబడిపోయాడు. కాని బండి వెళ్ళిపోయింది. సదానందానికి ఏదో కడుపులో దేవినట్టయింది. ఏదోపోగొట్టుకున్నట్టు అనిపించిం దతనికి. గబగబ ఇంటికొచ్చాడు. లోపల అమ్మా నాన్నా వరండాలో ఉన్నారు. రంగయ్యగారు వాలుకుర్చీలో కూర్చుని, కప్పువంక చూస్తున్నాడు; తల్లి నేలమీద కూర్చొని వున్నదల్లా కొడుకు లోపలికి రావటంలో తలఎత్తి, "ఏం నాయనా ఇంతసేపూ ఎక్కడికి వెళ్ళావురా? అమ్మో! అదేమిటిరా, ముద్దగా తడిసి వొచ్చావు? వెళ్లి పొడి గుడ్డలు తొడుక్కో. దగ్గూ పడిశం పట్టుందిరా," అన్నది. ఆమె గొంతు బొంగురుపోయి వుంది.

సదానందం, "అప్పుడే పంపించావా వాళ్ళని? రాత్రికి వెళ్తారనుకున్నానే? ఏం తొందరవొచ్చిందీ!" అని అడిగాడు, అలాగే నిలబడి.

రంగయ్యగారు తలెత్తి కొడుకువంక చూసి "ఇప్పుడే వెళ్తామన్నారు, వెళ్ళారు..." అన్నాడు ముక్తసరిగా.

సదానందం, "అమ్మాయి ఒక్కమాటా మాట్లాడకుండానే వెళ్ళిపోయిందే! పోనీ స్టేషను కెళ్ళనా?" అన్నాడు, వెళ్ళటానికి ఉద్యుక్తుడై.

రంగయ్యగారు "వాళ్ళు ఈ బండికే వెళ్తారు. నువ్వెళ్ళే ప్పటికి బండి కదిలిపోతుంది లాభంలేదు. ముందుపోయి పొడిగుడ్డలు కట్టుకుని తలతుడుచుకో—పో" అన్నాడు.

సదానందం తన గదిలోకి వెళ్ళాడు.

రంగయ్యగా రొక్కసారి కుర్చీలో కూర్చున్న పాళంగా ఇల్లంతటినీ కలయచూశాడు. ఇల్లంతా బావురుమంటున్నది. అక్కడికక్కడికీ ఈ వెలితి ఆయన హృదయానికి మహాభారంగా పరిణమిస్తోంది. ఆయన మెల్లిగా లేచి పూజగదిలోకి వెళ్ళాడు, నీరసంగా అడుగులు వేస్తూ. కోదండరాముడి ముందుగానీ ఆయనకా భారం తీరేట్టు కనిపించలేదు.

వరలక్ష్మమ్మగారు భర్తవంక చూస్తూ దిగులుగా కూలబడి పోయింది. (ఇంకావుంది)

# ★ దివాణం చేరివేట ★

అడవి కొండని పొడుచుకొచ్చేరు. యింకా సూర్యుడుదయించనేలేదు. చావిడిముందు నీలాటి రేవుకి వెళ్ళే పడతులంతా చుట్టూ వలయంకట్టి నిలుచున్నారు. పాలికాపులంతా పొలాలకు పోతూ పోతూ ఆ ముచ్చట కాస్త తొంగిచూసి మరీ వెళుతున్నారు. ఎదురుగావున్న కొగుచెట్టు పచ్చగా ఆకు తొడిగి ముచ్చటగావుంది. పక్కనే చెట్టునానుకొని వున్న కోనేటిలో తామర పువ్వులూ, ఆకులూ సూర్యునికోసం విప్పుకుంటూవున్నాయి. బంగార్రాజుగారి పెద్దకొడుకు కొగుచెట్టుమీద కోతిలాగ మెలికలు తిరిగిపోతూ పందుప్పుడకలు విరుస్తున్నాడు. కడవలు పట్టుకుని నోట్లో పందోము పుడకలు నములుకుంటూ రెండు చేతులూ వూపుతూ నెత్తిమీద కడవలు కింద పడకుండా కాసుకుంటూ ఒకర్నొకరు తోసుకుని అంతవరకూ సాగుతున్న లోకాభిరామాయణం చాలించి చచ్చిపడి వున్న పందిని వింతగా తిలకిస్తున్నారు. చావిడి అరుగులమీద చినరాజులంతా చతికిలబడి కూర్చున్నారు. రాట్లకూ స్తంభాలకూ వేటకుక్కల్ని కట్టేరు. గోడలకు చేరబెట్టిన యీటెలు తళతళా మెరిసిపోతున్నాయి. వాళ్ళ ప్రతాపాలూ కబుర్లూ వీరోచిత గాథల్లో జయలక్ష్మిని చేపట్టి వచ్చిన సైనికుల సంభాషణల్ని స్ఫురింపచేస్తున్నాయి.

"ఓలమ్మో! ఎంత బలిసిందే; దాని జిమ్మడా; గరువుమీన ఏరుచనగ చేనంతా డొ సెదాన్నెట్టుకుంది" అంది బంగారి నోటిలో పందోము పుడకతీసి తుబుక్కున వుమ్మేతూ.

"పెదరాజుగోరు అడివి కెల్లినప్పుడింతకి నాలుగింతలుంటాది కోరలుకూడా వొచ్చి వుండొయ్యి. నువ్వెరగవుగానె, నానారినో యిళ్లో పని సేసేదాన్నె, అప్పుడా పెద రాజులంతా ఏటకెల్లి పందుల్ని తెచ్చోరు. పందెప్పుడు దివానానికి వొచ్చినా అయ్యగోరు తోల్ను వొలుసూ కూడా యిట్టివోరు, ఎంత కమ్మగుండేదనుకున్నావు; మల్లీ జనమలో అసాటిది రుసి సూస్తేదనుకో" అంది ముసలిబుంగి నోరు చప్పరిస్తూ పడిపోయిన దివాణం గోడలపైపు చూస్తూ.

"ఓ దప్పుడు దాకెందుకే, నాను మాయత్తోరూళ్లో రాజుగోరి చేరినోకి పాటు కెల్లినాను. ఆయాల ఊడుపుల్లోల్లందరికీని ఏటపోతునేయించి మావిడిబద్దలు సంచుకెట్టి పులుసూకూడా ఏసినారు. అది రుసంతే రుసికాదు, గంగ పిన్నమ్మా! ఏదన్నా రాజుగోరింటికూడు రుసేసె నువ్వంతే ఏదో అనుకున్నాంగానె." అంది అట్టాడ చిట్టి.

"నీ బొందదేంటె! గంగమ్మత్త అడివిపంది విచయం చెపుతుంతె మద్దిని దానత్తోరూసు" నరసమ్మ విసుక్కుంది.

"అడివిపంది మాంచం ఎప్పుడయినా మూనూసినావె" చిట్టిని నిలవేసడిగింది గంగి.

"నా కెక్కడిదే? నువ్వే ఆనోగిలీ ఆనోగిలీ జేపురుతావు, మావిడిబద్దలికే గట్టాను. కుంతటుకురాయి అంతే తెత్తావా? ఏవన్నానా? అక్కడే నోట్లో వాడీసుకొత్తావు. మూడాకా వొత్తాయా?" అంది చిట్టి మూతి బిగించి:

## పూసపాటి కృష్ణంరాజు

కోసామంగి వయస్సు మళ్లింది. మనువుకి వెళ్లిక పూర్వం ముందు రాజుగారి దివాణంలో అంట్లుతోమేది. వయస్సులో వుండగానే దివాణం గోడలు జారిపోవడం రాజులు పత్తా సన్నగిల్లడమూను. అప్పటి రాజులు అరుగులు దిగేవారా? కాలు కదిపేవారా! యిప్పుడీ చినరాజులు ఎక్కడ చూసినా వారే. తోటకట్లల్లోనూ, మెట్టు గరువుల్లోనూ అన్ని జాతుల్లోనూ తిరుగుతున్నారు. దివాణంతోపాటు బుద్ధీ మారినట్టేనా? జారిన గోడలమీద తాటికమ్మతో నిలబెట్టిన కొంజాను చావిడని అంటారు గాని ఆనాటి దివాన్ ఖానాకి దీనికీ పోలికే లేదు.

పదేళ్లకిందట ఊరు కాలిపోయినప్పుడు సకం సకం కాలి మొరడులా వున్నదాన్ని సింహద్వారమని, గోడలన్నీ జారి దిబ్బపడ్డ భాగాన్ని దివాన్ ఖానాఅనీ, చావిడి ముందు భాగాన్ని బొంకులుదిబ్బ అనీ, అనుకోవడం లాంఛనప్రాయంగా మిగిలేయిగాని, వాటి స్వరూపమే మారిపోయింది. ఆ తరంలో మిగిలిన వారల్లా ఎనభై ఏళ్ళు దాటిన రాంభద్రరాజుగారు మాత్రం కనుపిస్తున్నారు. దర్గాలూ, కోటలూ ఒక్కలాగున్నాయి. యివన్నీ కోసాగంగికి తెలిసినవే, అయినా అడివిపందిని చూస్తూవుంటే అయ్యగారు దివాణంలో స్వయంగా తనను పిలిపించి దగ్గరుండి పందివాళ్లు పులుసు వడ్డింపిస్తే ఆప్యాయంగా తిన్న రోజులు జ్ఞప్తికొచ్చేయి.

ఈ ముసలిరాజుగారు పూనుకుని తుప్పట్టిన యీటెలను దులిపించి చినరాజుల నందర్నీ తలోకుక్కనీ మేపమని, సరంజాం అంతా కూర్చి తరిఫీజు యిస్తున్నారు. వేట మొదలుపెట్టి ఆరుమాసాలయినా పంది పట్టుబడ్డం యిదే ప్రథమం. వేరుశనగకాయల రోజులు పందులు కొండదిగి పల్లపుపొలాలకు వచ్చేయి. చేలు పాడుచేస్తున్నాయి. మాంతి బంగారిగరువు కొంచెం అంచునే వుంది. ఆ గరువులో చేనంతా పందుల పాలబడ్డదట. అందుకే బంగారి గోలపెడుతూ వుంది.

"అకేందె. చూత్తందోలమ్మో! నాకు బయ్యమె. నాను సూడనే నమ్మో" అంది, అప్పుడే వచ్చిన ఎంకి, బిందె వయ్యారంగా నడుంమీద తిప్పుతూ.

"ఏటో లాగలాడె, చింగినాద్దం గాని. చచ్చి వొల్లకతొంగున్న పంది దీనికోసం కన్ను తిప్పిందట." అంది సీతాలు విసురుగా. సీతాలు మాటకి అంతా గొల్లున నవ్వేరు.

ఎంకిని చూస్తే తక్కిన ఆడవాళ్ళకంతరికీ ఏదో అసాలనే వుంటుంది. మంచి యీడులో వుంది. బొద్దంచు కోక కట్టుకుని కానీ అంత బొట్టుపెట్టుకుని పెద్దసవరంతో తాటికాయంత కొప్పు ముడివేసి ముక్కుని

కత్తి కదుల్తూవుంటే గడ్డిబుంగ చేత్తో వూపుకుంటూ, వీధిలో నడిచి వెళుతూవుంటే, చినరాజు లంతా వాళ్ల హృదయాలమీద హంసలు నాట్యం చేస్తున్నట్టు ముగ్ధపడే వారు. గడ్డిబుంగపట్టుకుని ఎంకి ఏగరువుమీదకు గడ్డిపరకలకు వెళితే ఆ గరువంతా కళకళలాడుతూ వుండవలసిందే. ఒక అందికత్తె తక్కిన ఆడవాళ్ళ హృదయాల్లో ఈర్షని రేకెత్తిస్తుంది.

"నా వూపెత్తొద్దంటే సిగ్గేటి." అంటూ బిందె నడుంమీద కుదురుగా వుంచుకుని గబగబా అంగలు వేసుకుంటూ నీలాటి రేవుకి వెళిపోయింది ఎంకి.

రాంభద్ర రాజుగార్ని అంతా పెదరాజుగారని పిలుస్తారు. దివాణం పడిపోయినా కొలూ ఖయ్యా వొంగినా మీసాలు దువ్వడం, చేపాటి కర్ర వూపడం రాజుగార్ని వదల్లేదు. చేరిలోనుండి నక్క పిల్లి చేపాటి కర్ర వూపుకుంటూ వస్తున్నారు. వెంకడు ఆయన వెనకనే పిల్లిలా అడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు. యీ కబురా కబురు చెప్పి పెదరాజుగార్ని స్వయంగా దగ్గరుండి తీసుకొస్తున్నాడు. ఆయన కుర్రతనంలో వేటలో ఆరితేరిన చెయ్యి. లేడిని మెప్పించి పరుగెత్తేవారట. యీ వేట అంతా ఆయన పట్టుదల, ప్రజ్ఞాను, ఆయన చినరాజు లందరికీ భీష్ముడు. అలగా జనం అంతా రాజుగారిని చూసి దూరంగా తప్పుకున్నారు, వేటకుక్కలన్నీ తోక లాడించేయి. చినరాజులంతా లేచి నిలుచుని పెదరాజుగారిమీద గౌరవం వెల్లడించేరు.

"ఏ పొలంలో దూపు డయింది జగన్నాధం?" అడిగారు రాజుగారు. జగన్నాధం చినరాజులందరికీ వేటల్లో సైన్యాధిపతి. ఆయనదగ్గర రెండు కూనలున్నాయి. అందులో ఒకటి గాలి-కూన. ఆ కూనకోసం ఎన్నో వ్యయప్రయాసలకులోనై తీసుకొచ్చేరట. పందిజాడ ఏవైపునుండి వస్తున్నదీ పసిగట్టి తక్కిన కుక్కల్నీ వేటగాళ్ళనీ ఆ వైపుకి నడిపిస్తుంది. అందుకు ఆ కుక్క అంటే అందరికీ అభిమానం.

"ఎర్రవాని గరువుమీద కూనల్ని విడిచిపెట్టాం బావాజీ" జగన్నాధం పెదరాజుగారికి మనవిచేసేరు.

"బొత్తిగా వరిగెలా అవుపిస్తుంది బాబూ!" రాజుగారు చేపాటికర్ర బుజాలమీద వేసుకుంటూ అడిగేరు.

"తొగలోవుండి గెడసదేరిపోయింది. తొగ నిరుటి తొగయికూడా వుంటది తాతయ్యా" సమాధానం చెప్పేడు, తాతమ్మ.

"వెళ్ళిన గంటకే కూన గాల్లాగింది అందరం కూనల్ని విడిచిపెట్టాం. గరువుదాటి బంద అరగడిలోకి దిగుతుంది కుక్కల్దాయి. శంకరం యీ పెచేసాడు" జగన్నాధంగారు మనవిచేసేరు.

"యిదేదో అంత బాగా అనడంలేదు జగన్నాధం" సంకోచించేరు పెదరాజుగారు.

"ఒంటిపంది క్షణంలో తప్పుకుంది, లేకపోతే యీపాటికి తమరు బండి లోలించుకు అడివికి రావలసిందే" అన్నాడు సుదర్శనం.

"వీడి కోతలకేం లెద్దురు తాతయ్యా; గడ్డలో చలికిలబడి కూర్చున్నాడు. ఏమిటోయ్! యిక్కడున్నావని అడుగుతే 'ఒంటిపంది వస్తుందని యిటొచ్చాను ఆ బలుసుదుబ్బు చాటుని మాదేసుక్కూర్చుంది మాట్లాడకు పుటాయించి పోద్ది' అంటాడు. తీరా చూస్తే అక్కడ పందిలేదు వాడి బొందాలేదు" అన్నాడు తాతమ్మ.

"అవునమ్మా, పంది మిమ్మల్ని పొడవమని అక్కడ కూర్చుంటుందా? క్షణంలో ములుగు ములుగుపోద్ది." పంది ముందయితే అడ్డడం ఫాలాక్షుని తరం కాదు" అన్నారు అనుభవజ్ఞులు రాజుగారు.

"మీరు నా మాట నమ్మరు ఏంచేద్దునూ" అన్నాడు సుదర్శనం.

"నీకింకా అనుభవం చాలదమ్మా, కుర్రకుంకవి" అంటూ పెదరాజుగారు మీసాలు దువ్వుకుని చావిడి అరుగుమీద కూర్చున్నారు.

"కాళ్ళు కురసగా వున్నాయోయ్" అన్నారు రాజుగారే మళ్ళీ ముభావంగా.

"అయినా విపరీతమైన బలువు వుంది తాతయ్యా! నలుగురం పాతచేరీ వరకూ మొయ్యలేక భుజాళ్ళు పులిసిపోయినాయి" అన్నాడు శంకరం.

"ఏవో అయింది. మంగలి తవిటియ్యాకీ పీరు సాయిబుకీ వర్తమానం పంపేరా"? అంటూ లోగిల్లోకి దయచేసేరు, పెదరాజుగారు.

"ఇంక ఆలస్యం ఎందుకూ, పట్టండి వలుగుకూ, చావిట్లో వేద్దాం" అన్నారు జగన్నాధంగారు.

"శంకరం! తాటికమ్మలు కోసుకురావద్దటోయ్" అడిగేడు తాతమ్మ.

"సుదర్శనం వాళ్ళ పాలికాపుని పంపేడాడు" అన్నాడు శంకరం.

"నేనూ వెళ్ళనా ముంగాల కమ్మలికి?" అడిగేడు బంగారాజుగారి అబ్బాయి నిక్కరు మీదకు లాక్కుంటూను.

"వొద్దు. అరుగుమీద చాపలుతీసి వరండాలో వెయ్యమ్మా" అన్నారు జగన్నాధంగారు. బంగారాజుగారి కుమారుడు తారాజువ్వలా పరుగెత్తేడు.

మంగలి తవిటియ్యా, పీరుసాయిబూ చూరకత్తులు జిగజిగా మెరిసేలా పదును పెట్టుకుని వచ్చేరు.

సుదర్శనం, తాతమ్మా, బంగారం మంగలి తవిటియ్యా పందిని తెచ్చి అమాంతం చావిడి వెనకభాగం వసారాలో చాపలమీద దించేరు.



## బుట్టల అల్లికం

—ఫొటో: జి. రామానుజరావు, అమలాపురం.

పొద్దుగుంకులో పందిని సాయిబూ, తవిటియ్య, సుదర్శనం, జగన్నాథం కలిసి ముక్కలు ముక్కలుగా తరిగేరు. మాంసపు దుకాణంలో కసాయివాడు గుక్కమీద కైమా కొట్టినట్టు చకచకా దుమ్ములు నన్నిటిని తొత్తుమ్ము బిసిమర్చేసేరు.

"డాక్టరుగారికి ఒక వాటా పంపించండోయ్" అనుకుంటూ పెదరాజుగారు స్నానంచేసి యిస్త్రీచేసిన కట్టుకుని చావిడ్లోకి దయచేసేరు.

సాయిబు తూపసిమీద మాంసము చిన్న చిన్న వాటాలు వేసేడు. తవిటియ్య క్షణంలో అన్ని వాటాలూ తాటికమ్ములో అందంగా ముంగాలు కట్టేడు. ఊళ్ళో రాజులంతా తలా వాటా పట్టుకుపోయేరు. డిస్ట్రిక్టుబోర్డు ఆసుపత్రికి కొత్తగా వచ్చిన డాక్టరుగారికికూడా ఒక వాటా పంపించేరు. ఒకగంటకి పూర్వం పెద్ద కమేళావలే వున్న చావిడి మళ్ళా యథాస్థాయికి వచ్చింది.

రాజులంతా వేటపంది మాంసము సుష్టుగా భోజనంచేసి రోజంతా విశ్రాంతి తీసుకున్నారు. ఎంసంత సేపూ స్కూలు కుర్రవాళ్ళు చావిళ్ళో నిర్భయంగా ఆడుకున్నారు. మధ్యాహ్నం నాలుగుదాటింది. ఒక్కొక్కరే వచ్చి చావిళ్ళో ఆసీనులవుతున్నారు. పెదరాజుగారుకూడా వచ్చేరు.

రాత్రి వేట విషయాలు, పూర్వం పెదరాజుగారి అనుభవాలూ, అన్నీ కలగాబులగంగా సంభాషణలలో దొర్లిపోతున్నాయి. పెదరాజుగారి పాలికాపు వెంకడు వచ్చేడు, వాడితో మరో ఇద్దరు నూతనవ్యక్తులుకూడా వున్నారు. అందులో ఒకడు పెదరాజుగారికి నమస్కరించేడు. ఆయన ప్రతినమస్కారం చేస్తూ,

"ఎవరు వెంకో వాళ్ళు?" అని ప్రశ్నించేరు.

"కొండకావ గొల్లపాలెం బావూ" వెంకడు చెప్పేడు.

"నాను బావూ చంద్రాయిని. ఏలినవోరు మరిసిపోనారుగానె, నాను తంవరేట కొచ్చినోప్పుడు తాటికాయా, మట్టాకొట్టి మకాంకొ కొట్టుకొచ్చి వోడ్ని" అన్నాడు.

"నువ్వు చెంద్రిగాడివటరా! మీ బాబు అప్పిగాడు కుశాలాగా వున్నాడా?" అన్నారు రాజుగారు చంద్రాయిని పోల్చుకొని.

"నేను బావ్రా, మా నేను కినక్కాయల రోజుల్లో కాలం సేసినాడు" అన్నాడు విచారంగా.

"అవు సెప్పటివాడు, నాకంటే పెద్దవాడు, నే నేనో యీలా వున్నాను కాని కొంచెం నడుస్తే ఆయాసం అదీ వొస్తుంది" అన్నారు పెదరాజుగారు.

"ఏలినవోరు కరునించాల బావూ" అన్నాడు జంకుతూ ఏతి చెంద్రాయ.

"ఏం! ఏం కావాలి?" అని చూసేరు రాజుగారు.

"పారపాటు జరిగిపోనాది. దివానం కేతిరి సిత్రాజులంతా వొచ్చి నా కొంపదీసినారు" అన్నాడు చంద్రాయ.

"మేం నిన్నేం చేశాముర్రా?" అడిగేరు జగన్నాథంగారు.

"మా తమ్ముడు చరదా పడితేని నిరుడీ

# ★ దివాణం చేరిపేట ★

తోజుల్లో పందేలోల్లకాడ జిగిని పందికూన నుచ్చుకున్నాను. రేత్తిరి గూటికి రానేదు. ఏవయిందా అని ఆయాలదాకా గరువులన్నీ ఎతికినాం. అదేవో త్తదికదాఅని కునుకొచ్చె తొంగుండిపోనాం దివానం. ఏలినవోరు సిన్రాజులంతా తెపిల్చి ఎంతేసుకొచ్చె గరువుకాడ నిక్కడ్డకూన్ని పొడుసుకొచ్చి నారంట. మూనాలకిందట చాకలోల్లొచ్చె డబైరూపాయలిత్తావంటే యిచ్చేందుకాదు మావోడు. నాను యిచ్చియ్యే అంటే యిన్నాడుకాదు. మాపీ పొద్దు గరువుల మీన తిరుగుతుంటేనె సతివాడోల్లు సెప్పినారు. దివానం రేతిరి తెపిల్చి ఏసుకొచ్చి తెల్లారిగట్ల పందింతెచ్చి మా కల్లంకాడ దించినారు. మాం నూసినాం 'ఏటి బావూ జిగిని పంది నొట్టికల్తన్నారంతే' రాజులకి కోపంవొచ్చి తంతాలేవో అని వల్లకున్నాం. 'నీదయితే అప్పుడే అడుగుదుం' అన్నారు, బావు. తెలిసొచ్చినాను ఏలినవోరు కటాచ్చించాల" అన్నాడు గుడ్లలో నీరు నింపుకుని.

"మేము అడవిపందిని పొడుచుకొస్తే మీ పంది అని వేషాలు వేసుకొస్తారా?" అంటూ కంకరం లేచేడు.

"నేదు మారాజా బూజేవి సొచ్చిగా, నా తమ్ముడుమీన సెయ్యేసి సెపుతున్నాను. సతివాడోల్లు నూసినారు దివానం" అన్నాడు.

"అన్నీ దొంగవేషాలు తన్ని గాడిదని అన్నారు" జగన్నాథంగారు.

తాతమ్మ నాటకంలో యాక్టరులా లేచేడు, చంద్రాయ దవడ టపాకాయలా పేలింది.

"బాబోయ్ రాజులు సంపేసినారు" అంటూ అక్కడే చతికిలబడ్డాడు చంద్రాయ.

నీలాటి రేవుకి వచ్చేజనం నిలుచున్నారు. పశువులన్నీ దొడ్లకు తిరిగొస్తున్నాయి.

రాజుగారు మెల్లగా అరుగు దిగొచ్చేరు చంద్రాయిని చెయ్యపట్టుకు లేవనెత్తి లోపిట్లోకి తీసికెళ్లి ఏభైరూపాయిలు చేతికిచ్చి పొమ్మన్నారు. చంద్రాయితోనే మళ్ళీ చావిట్లోకి తిరిగొచ్చేరు. చినరాజులంతా కిక్కురుమనలేదు. బిక్కమొహాలు వేసి కూర్చున్నారు.

"నాకు అనుమానం వేసింది, ఊరపందేమో అని. లేకపోతే అడవిపంది సాపూదస్కాం దీనికి లేకపోవడం ఏమిటా? అంటే పూరుకున్నారా? గిడసబారిపోయింది, తొంగుంటే వుండిపోయింది, కోరిగపంది బరువుగావుంది, దిబ్బవోల్లకాడు అన్నారు. ఛీ! వెధవలు, వేటా లేదు పాటా లేదు రాచపుట్టుక పుట్టి ఊరపందిని తిన్నారు పాండి వెధవ నాగమ్మలు" అనుకుంటూ రాజుగారు కోనేటివైపు వెళిపోయారు.

"నాకూ అనుమానం వేసిందోయ్ చెప్పకేం గాని" అన్నారు జగన్నాథంగారు కాళ్ళు చాపుకుని కూర్చుంటూను.

మరో పది నిమిషాల్లో చావిడంతా ఒకరితో ఒకరు చెప్పకుండా కాళీచేసేరు.

ఎంకి బుంగనిండా గడ్డి తవ్వుకుని నెత్తినుంచుకుని వొయ్యారంగా వస్తూంది. చిట్టీ, మంగీ, నరిసీ కడవలు పట్టుకుని నీలాటిరేవు కొస్తున్నారు.

"గంగత్తా గంగత్తా నూసినావె రేతిరి సిన్రాజులు ఏటకెల్లి తెచ్చింది అడివిపంది కాదంట, ఏత చెంద్రాయ మేపుకుంతన్న జిగిని పందట! రాజుగోరి ఎంకడు సెప్పినాడు, గడ్డికెల్లొత్తుంటేనె" అంది, ఎంకి చిత్రంగా ముక్కులో నత్తు ఎగరవేసుకుంటూను

"ఓలమ్మ! ఓలమ్మా! ఏం గాచారమే" అని గంగమ్మ ముక్కుమీద వేలుపెట్టుకుంది.

"సిన్రాజులసేరా ఏట జిగిని పందిని కాపోతే అడివిపంది మీనటే" అంది నరిశి నవ్వుతూనూ. ఎంకికి అంతా అర్థమయినట్టు బుర్ర తిప్పుకుంటూ గ్రామంలోకి వెళిపోయింది.



# సీతాపహరణం

అనగా అనగా రాముడనే వాడున్నాడు. అతను ఆగర్భ శ్రీమంతుడు. ఆడింది ఆటగా, పాడింది పాటగా, ఒక్కగా ఒక్క కొడుకవటంవలన, వాడు చేసిందల్లా చెల్లుతున్నది ఇంట్లో, (చేసిందంటే మరేం లేదనుకోండి, స్నేహితుల్ని పోగుచేసి సినిమాలకు, షికార్లకు, కాఫీ హోటళ్లకు డబ్బు తగలెయ్యటం, సిగరెట్లు కాల్చటం, బడి ఎగ్గొట్టి ఆడుతూ పాడుతూ కాలం వెళ్ళబుచ్చటం మాత్రమే) పుట్టి పెరిగినవూళ్లో ఎక్కువ చదువులు లేకపోవటంవలన, వాడ్ని పట్నం పంపించారు తల్లిదండ్రులు, చదివి ఏదో వెలగపెట్టాడని. కొంతకాలం వాడు పట్నంలో మేనమామగారింట్లో మకాం వేశాడు. తర్వాత తన దినచర్యకు మేనమామగారు అడ్డవటం వలన, వేరేరూమ్ అనేది తీసుకొని తనకు దూరపు చుట్టమూ సహాధ్యాయి అయిన లక్ష్మణుడితో కలిసి హాయిగా కాలాన్ని వెళ్లబుచ్చ సాగాడు. ఆనాడు రాముడికి హనుమంతుడి వలె ఈనాడు ఈ రాముడికి లక్ష్మణుడు నమ్మిన బంటు.

ఇంట్లో వాళ్ల పోరువల్లనైతేనేం, ప్రోద్బలం వల్లనైతేనేం, మాష్టర్ల చేతి దలువవల్లనైతేనేం, మెట్రిక్యులేషన్‌వరకూ ఎట్లాగో రాముడు నెట్టుకుంటూ వచ్చాడు. కాని, ఆ మెట్రిక్యులేషన్ పరీక్ష వంపులేకుండా సాఫీగావున్న తన జీవితబాటలో ఓ పెద్ద గండి అయిందని పరీక్షలు కొద్దిరోజులున్నాయనగా తెలుసుకున్నాడు.

**రామ్‌చంద్**

పట్నంలో రాముడుకి ఓ మేనమామ ఉన్నాడన్నాంకదూ; ఆయిన పేరు భద్రంగారు. సీత, ఆయనకుమార్తె. పదహారేళ్ల సీతకు, పదహార్నో ఓ తొమ్మిది పాతికేళ్ల రాముడుకు మధ్య ప్రణయం రేగింది, అయితే ఆ ప్రణయం ఎటువంటి ప్రళయానికీ దారి తీయక వారి హృదయాల్లోనే మునిగి, కేవలం ఒకరొకరు చూసుకున్నప్పుడు కళ్ళతో మాట్లాడుకోవటంతో ఆగిపోయింది. వాళ్లిద్దరి పెళ్ళి తన కళ్లముందే జరిగితే హాయిగా ఏ విచారమూ లేకుండా కళ్లు మూస్తానంటుంది భద్రంగారి తల్లిగారైన పార్వతమ్మగారు; కాని పిల్లకు ఏమంత ఈడుందని అప్పుడే పెళ్లంటావు అంటాడు భద్రంగారు.

భద్రంగారు సంస్కారి; స్త్రీ విద్య తన ఇంటిని సంస్కరించటానికి తొలిమెట్టని ఆయనకు ఘట్టి నమ్మకం. ఆయన తన నమ్మకాన్ని ఒట్టినే పోనివ్వడనటానికి సాక్ష్యం సీత చదువు. ఆయన సీతను చదివిస్తున్నాడు, ఇంట్లోవాళ్లు "మనవంటివాళ్లకు తగనిదని" ఎంతగా చెప్పినా వినక. సీత రాముడు



జెలో రష్యా లలితకళా ప్రదర్శనంలో జానపదకళకు సంబంధించిన అల్లిక పనితనం. (ఫొటో: ఎమ్. ఓ జెర్స్కీ)

చదువుతున్న స్కూళ్లోనే మెట్రిక్లేషన్ చదువుతున్నది.

పరీక్షలు దగ్గిరపడ్డాయి...ఆరోజుగడిస్తే పరీక్షలు.

* * *

పడకకుర్చీలో పడుకొని సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ, ఆలోచనల్లో అఘోరిస్తున్న రాముడు, ఇంజన్ కూతలాంటి పెద్ద ఆవలింతతో గది నావరించిన నిశ్శబ్దాన్ని చీల్చి చెండాడాడు. రాత్రల్లా నిద్ర లేదు; రెండు కప్పుల ఓవల్టిన్, మూడు చపాతీలు (బంగాళా దుంపలకూరతో సహా), మరో గ్లాస్కుడు టీ తప్ప అన్నం ఏమాత్రంగూడా ముట్టలేదు పాపం. పరీక్షలు మరునాడే ప్రారంభం, మరేం చెయ్యాలి అనేదే సమస్యై వేధిస్తున్నది. ఆలోచన ఎంతకూ తెగటంలేదు సమస్య పరిష్కారం కావటంలేదు. తను ప్యాసవుతాననే ధైర్యం ఏనాడో అడుగంటింది అతనిలో. ఇహ చదివి మాత్రం లాభంలేదని ఇన్నిరోజులు హాయిగా సినిమాల్లోనూ, బీచి షికార్లతోనూ కాలం గడిపాడు. కాని ఉన్నట్లుండి, రేపు పరీక్షనగా ఇవాళ తనకు "పరీక్షయి తీరాలి" అని పుట్టింది. పుట్టటమేమిటి పుస్తకాలన్నీ ఒక్కసారి తిరిగేశాడు, కాని ఏనాడైనా వాటిని ముట్టుకున్న పాపాన పోతేగా, అవి అర్థమై చావటానికి. ఎలాగైనా తను ప్యాసై తీరాలి; కాని అవటానికి అణుమాత్రం గూడా అవకాశం లేదు. కాపీచేయటం పాపపుపని అతని ఉద్దేశ్యం. మరేదో ఒకటిచేయాలి. ఆ చేయాల్సిన ఒకటి ఏమిటనేదే ప్రశ్న.

అంతవరకూ దూరంగా కిటికీ వద్ద కూర్చొని వివిధమానవుల్ని చూడటంలో నిమగ్నుడైన లక్ష్మణుడు చిటిక వేసి, ఎగిరి గంతు వేశాడు. "యురేకా-యురేకా (కనుగొంటిని, కనుగొంటిని) అని అరుస్తూ.

రాముడు పడక కుర్చీలోనుండి త్రుళ్లిపడి లేచాడు, అంతవరకు లక్షణంగా వున్న లక్ష్మణునికి ఇంతలోనే ఏమైందా అనుకుంటూ; అసలే చిరాకుగా వున్నాడాయె పరాకుతో, లక్ష్మణునపై అమాంతం కోపం వచ్చేసింది, "యురేకా ఏమిట్రా నీబొంద," ఆర్కిమెడిస్ అవుదామనుకున్నా వేంటి! విసురుగా కసిరాడు.

"ఆర్కిమెడిస్ అంటూ ఆ అప్రాచ్యుడి పేరెత్తుతా వెందుకు! ఆ వెధవ పుట్టబట్టేగా ఈ ఫిజిక్స్ అవతరించి మన ప్రాణాలు తీస్తున్నది పరీక్ష ప్యాసవనీయకుండా," పకపక నావ్వాడు లక్ష్మణుడు.

"మొత్తుకున్నట్లే వుంది ఆ ఎత్తుపళ్ళు బయటబడుతూ నీనవ్వూ నీవూనూ, మిత్రుడు అన్నాహారాలు లేకుండా నానా అవస్థలు పడుతుంటే నీకు నవ్వుగానే వుంటిదిరా," అంటూ ముఖం మాడ్చుకున్నాడు రాముడు.

రాముడు మాటలు లక్ష్మణుడి తలలో దూరినట్లు లేదు. అతని సంతోషమేమో, అతడేమో. గంతులేస్తూనే, "యురేకా," అన్నాడు మళ్లీ.

రాముడు మండిపొయ్యాడు. కోపంతో అతని తాపం అంతింతై, అల్లంతై, ఆ సమయంలో ఆలోచన చెప్పే మిత్రుడు లక్ష్మణుడు తప్ప మరొకడెవరూ లేకపోవటం వలన చప్పున చల్లారి పూరుకొంది. అయినా అతనికి సంపూర్ణస్వేచ్ఛ నివ్వటం తన ఆత్మగౌరవానికే భంగం అనుకుంటూ, యురేకా లేదు, శశిరేఖా లేదు...నోర్ముయ్యవోయ్ వెధవ వాజమ్మా," అని గదిమాడు.

"శశిరేఖ కాదురా పిచ్చినాయనా నీ జీవితరేఖరా...సీత...సీత తెలియద్రా" ఎకిరింపుగా కొక్కిరించాడు లక్ష్మణుడు.

"సీత! సీత పేరెత్తావంటే వాతపెట్టా నోటిమీద...జాగ్రత్త...ఎవరన్నా వింటారని గూడా లేదు..." చీవాట్లు వేస్తూనే చరచరా వెళ్ళి పడకకుర్చీలో మళ్ళీ పడుకొని మానం వహించాడు. సీత పేరు వినగానే అతని ఆత్మ ఆవురుమంది; బావురుమని ఏడ్వాలనుకున్నాడు. కాని ఇంటివాళ్ళు వెళ్ళిపొమ్మని నోటీసు ఇస్తారేమోననే భయంతో మానంలో మునిగిపోయాడు.

రాముడు మానాన్ని చూచి లక్ష్మణుడు నిలువునా నీరయ్యాడు. కొయ్యబారిపోయేవాడే గాని రాముడు హృదయంలో రేగిన అగ్నిమంటల్ని ఆర్పటం ప్రాణమిత్రుడైనతన ధర్మం కాబట్టి, మెల్లిగా పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ రాముడివద్దకు వెళ్ళి, ముకాళ్లపీట లాక్కొని అతనిదగ్గరగా కూర్చున్నాడు. రాముడు ఉలకలేదు పలుకలేదు. లక్ష్మణుడు ఓదార్పుగా అతని భుజం మీద చెయివేసి "ఊరుకోరా బాబూ" అన్నట్లు తట్టాడు.

అంతవరకూ కళ్ళు మూసుకొని సీతాధ్యానంలో మునిగివున్న రాముడు ఒక్కసారి కళ్లు తెరచి ప్రక్కనే కూర్చున్న లక్ష్మణుని కళ్లల్లోకి నీళ్లు నిండిన తన కళ్లతో చూసి, అతని చేతిని తన చేతిలోకి తీసుకొని, "లక్ష్మా, గుండె ఫుండైందిరా. నా గతి ఇంత అధోగతికి దిగుతుందని అనుకోలేదు. ఒకటే దాహం వేస్తున్నది," అన్నాడు.

లక్ష్మణుడికి జాలివేసింది. "ఉండరా నాయనా, ఐస్క్రీం సోడా తెప్పిస్తాను, దాహం దానంతటదే తీరుతుంది"అన్నాడు.

"సోడాలతో షర్బత్తులతో తీరేది కాదురా ఈ దాహం. కడుపులో మంటలు రేగాయి. గుండె దడదడలాడుతున్నది చూడు," అంటూ లక్ష్మణుడి చేతిని తన గుండెకు హత్తుకొని, "నీవు నా ప్రాణస్నేహితుడివి. నా అంతరంగిక కార్యదర్శివి. నీకూ నాకూ మధ్య ఎటువంటి రహస్యాలు లేవు. ని కెన్నోసార్లు కాఫీటిఫిన్ ఇప్పించాను; సినిమాలకు తీసుకువెళ్ళాను; అప్పుడప్పుడు నా గుడ్డలు అరువిచ్చాను; నాకీ సమయంలో మంచి ఆలోచన చెప్పి సాయం చెయ్యరా బాబూ; ఈ విపత్కర విపరీత పరిస్థితిలో మార్గమేమిటో అర్థంగావటం లేదు. బరువుతో నా మనస్సు అరుస్తున్నది. మార్గాంతరం చెప్పరా" అంటూ కంటికి మింటికి ఏకధాటిగా కన్నీరు కార్చి, మూర్ఛపోయాడు రాముడు.

రాముడు మూర్ఛపోవటంతో లక్ష్మణునికి మతిపోయినంతపనైంది. 'సంజీవి' తీసుకురండ్రా అని కేకేశాడు, గ్లాసు అందుకుంటూ. సమయానికి ఇల్లు ఊడ్చే మనిషి హనుమంతుడల్లే తయారైంది చీపురుకట్ట పుచ్చుకొని. లక్ష్మణునికి ఎక్కడలేని బలం వచ్చింది దాన్ని చూడగానే. రాముడి జేబులు తడిమి పావలా కాసు బయటకుతీసి

గ్లాసు ఇచ్చి "వెళ్లి, వెంటనే రెండు కప్పులు స్ట్రాంగు కాఫీ తీసుకురమ్మని పురమాయించాడు.

రెంగుడు రెండు అంగల్లో వీధి చివరవున్న కాఫీహోటలుకు వెళ్లి కాఫీ తెచ్చింది పనిమనిషి;

కాఫీ చూడగానే లక్ష్మణుడికి రాముడి ప్రాణం వచ్చినంత సంతోషం వేసింది. గబగబా గ్లాసులోని కాఫీని రెండు గ్లాసుల్లో వంపి, ముందు తనో గ్లాసు ఖాళీచేసి రెండో గ్లాసు తీసుకొనివెళ్లి రాముడు నోటివద్ద పెట్టాడు. సెగలు కొట్టే కాఫీపొగ రాముడి నాసికారంధ్రంలో గుండా ప్రవేశించి వాడి బుర్రను ఒక్క తన్ను తన్నింది; అమాంతంగా లేచికూర్చుని, ఒక్క గుక్కతో గ్లాసు ఖాళీచేశాడు రాముడు.

"అరే రాముడూ, నీవు ఏడుస్తుంటే నాకూ ఏడ్వాలనిపిస్తున్నదిరా, అయినా నీవిక ఏడ్వాల్సినపనిలేదు. నాకో గొప్ప ఆలోచన తట్టిందిరా," అన్నాడు లక్ష్మణుడు.

"ఆ...ఆ...నిజంగా!...నీవంటే నీవేరా తమ్ముడూ....చప్పున చెప్పరా బాబూ చంపక. అదేంటో నీకు పుణ్యముంటుంది," ఆశతో లేచికూర్చున్నాడు రాముడు.

"చెప్తారా," అంటూ రాముడు చెవిలో నోరు పెట్టి ఏమేమిటో గొణిగాడు లక్ష్మణుడు.

రాముడికి ఎక్కడలేని బలం వచ్చింది. వేడెక్కిన అతనిబుర్ర చల్లబడింది. వేగంగా కొట్టుకుంటున్న గుండెదడ తగ్గింది. ఉత్సాహంతో కుర్చీనుండి లేచి నిలబడ్డాడు. సంతోషంతో లక్ష్మణుడివీపుమీద బలంగాగుద్ది, నొప్పి పుట్టుందని గూడా లేకుండా "థాంక్స్‌రా" అంటూ వాడిచేతిని నలిపేశాడు.

"అబ్బ వుండ్రా, చేయి నొప్పిపుట్టున్నది...ఇహ ఈ అర్థ నిరశనవ్రతాలు చాలుగాని పద వెళ్ళి భోంచేద్దాం," అన్నాడు లక్ష్మణుడు.

"లేదురా భాయీ, ఇది అటో ఇటో తేలేవరకూ అన్నం ముట్టుకోవటము నేది వట్టిమాట," అన్నాడు రాముడు ధీమాగా.

"కర్మ సరే ఏం చేస్తాం....పద కాఫీ దేవాలయానికి; ఏనాడో ఆ సాంబారు మనకు ఋణం వుంది. మనం వాడికి డబ్బులు బాకీ వున్నాం," అంటూ లక్ష్మణుడు హోటలుకు దారితీశాడు.

*    *    *

ఆరోజు గడిచిపోయింది. మరునాడు అరుదెంచింది. ఆ రాత్రల్లా అటు రాముడు ఏమౌతుందోనని తెగ ఆలోచిస్తూ కన్నుమూయలేదు. ఇటు సీతకు పరీక్ష చదువుతో అసలు కునుకనేదే లేదు.

ఆనాడు పరీక్ష...సీతారాములకు పరీక్ష.

*    *    *

"సీతింకా రాలేదేం చెప్మా," పచ్చిసు పావులు ఎత్తుతూ అంది అన్నపూర్ణమ్మగారు.

"పరీక్షలు కదూ, ఆలస్యమై వుంటుంది" అంది పొరుగింటావిడ లేస్తూ. "కొంచెం ఆలస్యమైతే అంత గాభరాపడతావెందుకే; అయినా ఈ వేరిన పిల్లకు ఈ చదువులేంటి, మా కాలంలో ఎరుగమమ్మా ఆ మాదు ముట్లూ ఏదో నా కళ్లముందే వేయించరా అంటే వాడు వింటేగా. ఏమిటో ఈ కాలం, కలికాలం.... పదహారేళ్లొచ్చినా పిల్ల పెళ్ళిమాటే తలపెట్టరుగదా," సణిగింది పార్వతమ్మగారు.

"అమ్మాయి వచ్చిందటే, పరీక్ష ఎలా రాసిందో," ఏదో పనిమీద బయటకు వెళ్ళిన భద్రంగారు ఇంట్లో కాలు పెడుతూనే అడిగారు. ఆయన రావటంచూసి పొరుగింటావిడ తనింటికి వెళ్లిపోయింది.

"ఇంకా రాలేదండి, ఈపాటికి రావల్సింది," అంది అన్నపూర్ణమ్మగారు భయభయంగా.

"ఇంకా రాకపోవట మేమిటి, ప్రైమై చాలా సేపయితే!" భద్రంగారి ముఖంలో ఆశ్చర్యరేఖలు అవుపించాయి.

"ఆ, ఎవరైనా స్నేహితురాలింటికి వెళ్లిందేమో వస్తూవస్తూ," అంది ముసలమ్మ.

"ఏ స్నేహితురాలైనా మనింటికి రావల్సిందేగాని అది ఎవరింటికీ వెళ్లదండీ," అంది అన్నపూర్ణమ్మగారు.

"మరేమైనట్లు"

"అదే తెలియటంలేదు," అంది అన్నపూర్ణమ్మగారు బిక్కముఖం పెట్టి.

వాళ్ళిలా మాట్లాడుకుంటూ వుండగా, బయటనుండి, "సీతా," అని కేక వినిపించింది.

"నేనేనండి," అంటూ సీత స్నేహితురాలు అనసూయ గుమ్మంలో కొచ్చి, ఎదురుగా కుర్చీలో కూర్చున్న భద్రంగారిని చూచి తలుపుచాటుకు తప్పుకుంది.

"పరవాలేదు రామ్మా, ఎవరున్నారు," అంటూ బయటకువెళ్ళి, అనసూయను లోపలికి తెచ్చింది అన్నపూర్ణమ్మగారు.

"సీత లేదండీ?" అడిగింది అనసూయ.

"పరీక్షకు వెళ్లిందమ్మా ఇంకారాలేదు. అదే అనుకుంటున్నాం. ఎప్పుడూ ఆలస్యమనేది ఎరుగదు," అంది అన్నపూర్ణమ్మగారు; కూతురు ఎక్కడికివెళ్లిందో ఏమిటో అనే దిగులు వణుకుతున్న ఆమె కంఠంలో మిణుకుమంది.

"పరీక్షకు వెళ్లిందా!...రాలేదండీ ఎందుకు రాలేదో ఏమిటో కనుక్కుందామని వచ్చానండి," అంది అనసూయ అర్థంగాక.

"పరీక్షకు రాలా! మరి ఏమైనట్లు?" భద్రంగారికి అగమ్యంగావుంది.

"నా తల్లి ఏమైందో, మీరింకా కూర్చున్నారేం. 'వెళ్లి చూడండి," ఆరోన్నాక్రశం అందుకుంది అన్నపూర్ణమ్మగారు.

"వెళ్లి పోలీసు రిపోర్టివ్వండి, పరీక్షకు రాకుండానూ, ఇంట్లో లేకుండాను మరి ఏమైనట్లు," అనసూయ సలహాయిచ్చింది.

"ఏమని రిపోర్టివ్వను," రుద్ధకంఠంతో అడిగాడు భద్రంగారు.

"పిల్ల తప్పిపోయిందనివ్వండీ," అంది అన్నపూర్ణమ్మగారు కండువా తెచ్చి ఆయనకిస్తూ.

# ★ సీతాపహరణం ★

"తప్పిపోవటానికి అదేమైనా చిన్న పిల్లటే," దెప్పిపొడిచింది పార్వతమ్మగారు; పిల్లకు చదువొద్దో అని ఎంత మొత్తుకున్నా విననందుకు తగిన పనే అయిందనుకొంటూ.

"నీ వుండవమ్మా...ఎప్పుడేం మాట్లాడాలో తెలియదు," అంటూ, "గాభరా పడకండి నే నిప్పుడే వస్తాను," అని బయలు దేరాడు భద్రంగారు.

ఎదురుగా కొత్త క్యాలెండరు మీద "సీత నెత్తుకొని వెళ్తున్న రావణాసురుడి బొమ్మ"ను చూస్తూ, సీతాపహరణం," అని మనస్సులో అనుకొని ఓ వేడి నిట్టూర్పు విడిచి, "మళ్లీ వస్తానండి" అంటూ వెళ్ళిపోయింది అనసూయ.

* * *

మైక్ ముందు నిలబడివున్న కథకుడు అయిపోయిందన్నట్లు ఆవులించాడు 'హ్హా' అని.

"అదేంటయ్యా, అసంపూర్తి కథ చెప్పి వెళ్తానంటావు? ఆ సీత ఏమైంది? అంతకు ముందు చెప్పిన రాముడేమయ్యాడు? లక్ష్మణ మంత్రాంగం ఏమిటి?" అంటూ పలువురు శ్రోతలు ప్రశ్నల వర్షం కురిపించారు.

"నేను చెప్తానన్నది సీతాపహరణమే ...అదే చెప్పేశాను..." అన్నాడు కథకుడు.

"ఏడ్చావ్—ఆ మిగిలిందిగూడా ఏడ్చి మరీ పో," అన్నాడో శ్రోతకుడు.

"నేను ఏడ్వటానికేం రాలేదు, కథ చెప్పటానికి వచ్చాను, చెప్పేశాను. మీరింకా ఎంత ఏడ్చి మొత్తుకున్నా లాభం లేదు, నాకు నిద్రవస్తున్నది," హీహీహీ అని నవ్వి, వెళ్లటానికి ఒక్క అడుగు ముందుకు వేశాడు కథకుడు.

"కాలు కదిపావా, ఒళ్లు హూనమౌతుంది జాగ్రత్త. కథ పూర్తిచేసిపో..." ఉద్రేకంతో అన్నారు శ్రోతలు.

"నా ఇష్టం...నా ఇష్టమైతే చెప్తాను కష్టమైతే మానాను. మధ్య మీరెవరు నన్ను ప్రశ్నలు వేయటానికి. కథకుల హక్కుకు భంగం కల్గిస్తున్నారు మీరు," అరిచాడు కథకుడు మైక్ బ్రద్దలయ్యేలా.

"హక్కూ గిక్కూ అన్నావా డొక్క చించుతాం జాగ్రత్త....ఊ కానీయ్ మిగిలిన కథ...." శ్రోతల్లో కలవరం రేగింది.

కథకునికి ఏమీ తోచలా. శ్రోత లందరి వైపూ చూచాడు. తను ఏమన్నా తన్నేట్లున్నారు వాళ్లు. చెప్పక తప్పదురా భగవంతుడా అనుకున్నాడు. మళ్లీ ఒక్కసారి ఆవులించి, కథ ప్రారంభించాడు.

* * *

కూతురు ఏమైందో అనే గాభరాతో, పోలీసులకు రిపోర్టిద్దామని భద్రంగారు ఇంట్లోనుండి బయటకు రావటం, వాకిట్లో కారాగటం రెండూ ఒకేసారి జరిగాయి. ఈ వేళప్పుడు ఈ సమయంలో కారు మీద వచ్చేవాళ్లెవరా అని, భద్రంగారు అనుకుంటూవుండగానే, కార్లోనుండి చిలకాగోరింకల్లా 'సీతారాముడు' దిగారు. సీతను చూడగానే భద్రంగారి హృదయం తేలిక పడింది. వాకిట్లో నిలబడిన తండ్రిని చూసి సీత గబగబా గడప దాటి లోపలికి వెళ్ళిపోయింది.

"ఏరా రాముడూ, ఏమిటిది! ఎక్కడ్నుంచి రావటం? సీతెక్కడ కన్పించింది," ప్రశ్నమీద ప్రశ్న కురిపించాడు భద్రంగారు.

"లోపలికి వెళ్ళి మాట్లాడుదాం రండి మామయ్యా," అంటూ ప్రశ్నలకు ఒకే సమాధానం చెప్పి లోపలికి దారితీశాడు రాముడు.

"వచ్చావమ్మాతల్లీ, ఎక్కడికి వెళ్లావో, ఏమైపోయావో అని గుండె పీచుపీచుమంది. పరీక్షకువెళ్ళక ఎక్కడికి వెళ్లావమ్మా," అంటూనే అమాంతంగా గుండెకు హత్తుకుంది కూతుర్ని, అన్నపూర్ణమ్మగారు; ఆమెకళ్లు ఆనందంతో తళతళ మెరిశాయి.

"ఇడిగోనే రాముడు, వాళ్లిద్దరూ కలిసి కార్లో వచ్చారు," గడప దాటుతూనే అన్నాడు భద్రంగారు.

"ఏరా, రాముడూ...ఊళ్లోవుండేకన్పించటం మానేశావేరా," అంది అన్నపూర్ణమ్మగారు ఎంతో ఆప్యాయంతో.

"పరీక్షలుగాదటే...మా నా య న ... రారానాయనా రా...సీతనువెదకి తెచ్చావా! నీభార్యను నీవు తెచ్చుకున్నావన్నమాట... కూర్చో," అంది ముసలమ్మ; కూతురుకొడుకంటే ఆమెకు వల్లమాలిన అనురాగం.

"ఏమ్మాసీతా, ఎక్కడికెళ్లావమ్మా. అంతా గాభరాపడిపోయాం. పరీక్షకు వెళ్ళలేదటగా," లాలనగా అన్నాడు భద్రంగారు.

సీత రాముడివైపు చూసింది. రాముడు సీతవైపు చూశాడు. ఇద్దరిచూపులూ కలుసుకున్నాయి. సిగ్గుతో సీత తల దించుకుంది.

ఎవరూ మాట్లాడరేమర్రా...మూగనోము పట్టారేంటి? అసలు ఏంజరిగిందిరా రాముడూ," అడిగింది అన్నపూర్ణమ్మగారు.

నీవు చెప్పు అన్నట్టు చూశాడు సీతవైపు రాముడు.

నేను చెప్పలేనబ్బా, నాకు సిగ్గుఅన్నట్లు కళ్లు తిప్పింది సీత.

"చెప్పవేరారాముడూ," కళ్లు పెద్దవిచేసి చూశాడు భద్రంగారు. ఎలాగా చెప్పటం అని తికమకలుపడుతూ రాముడు గొంతు సవరించుకొంటుండగా లక్ష్మణుడు ప్రవేశించాడు.

అందరికళ్ళూ లక్ష్మణుడివైపు మళ్లాయి; బ్రతికానురా భగవంతుడా అనుకున్నాడు రాముడు.

"ఏరోయ్ లక్ష్మణుడూ, దారితప్పి వచ్చావే ... రా, రా, కూర్చో," ఆహ్వానించింది అన్నపూర్ణమ్మగారు.

"ఏంలేదుఅత్తయ్యా పరీక్షలుకదూ తీరిక లేకుండావుంది, ఇటువెళ్తూ రాముడేమైనా ఇక్కడ వున్నాడేమో అని వచ్చాను," అన్నాడు లక్ష్మణుడు, భద్రంగారి ప్రక్క కుర్చీలో కూర్చుంటూ.

"ఇహ చెప్పరా చప్పున," అన్నాడు భద్రంగారు రాముడుతో. రాముడు లక్ష్మణుడివైపు చూశాడు. లక్ష్మణుడు ఓ చిరునవ్వు విసిరేశాడు.

"నేనూ ఇవాళ పరీక్షకు వెళ్లలేదు మామయ్యా," ప్రారంభించాడు రాముడు, కూడగట్టుకున్న ధైర్యంతో.

"నీవూ వెళ్లక! అదీ వెళ్లక!....ఏమిటిదంతా," ఆశ్చర్యంగా అడిగాడు భద్రంగారు.

"అదంతా నేను చెప్తాలే విను మామయ్యా, రాముడికేమో పరీక్ష పాస్యవుతానన్న ధైర్యం లేకపోయింది. సీత పాస్సైతే..." లక్ష్మణుడు చెప్తున్నది పూర్తవకుండానే, "అది పరీక్షకు వెళ్లలేదోయ్, ఇంకేం పాస్యవుతుంది," అంటూ బ్రేక్ వేశాడు భద్రంగారు.

"అదేనండి నేను చెప్పబోతున్నది. సీత పరీక్షకు వెళ్లి పాస్సైతే తన కిచ్చి చేయరనే భయంతో..."

"భయంతో ఏం చేశాడేంటి?" హుంకరించాడు భద్రంగారు.

"ఏం చేశాడులే, సీత వెళ్ళేదార్లో కాసి, కార్లో ఎక్కించుకొని, పరీక్ష ఒక పక్క జరుగుతుంటే మరోపక్క ఊరంతా షికార్లు కొట్టివచ్చాడు..." తన బాధ్యత తీరిందన్నట్లు రాముడివైపుచూసి తృప్తిగా నవ్వాడు లక్ష్మణుడు.

అన్నపూర్ణమ్మగారు అమాయకంగా నవ్వింది కూతురు తల నిమురుతూ; సీత సిగ్గుతో తల్లి హృదయంలో ముఖం దాచుకొంది; ముసలమ్మ ముక్కుమీద వేలేసుకొంది, ఎంత పని జరిగింది అనుకుంటూ.

భద్రంగారు ఉగ్రుడయ్యాడు. "ఎంత పని చేశావురా రాముడూ, నీవు చెడింది కాకుండా, దాన్నిగూడా చెడగొట్టావ్," అంటూ రంకెలు వేశాడు. అందరూ హడలిపోయారు. సీత గడగడలాడింది.

"ఏం చేసేది మామయ్యా, మరి నేను తప్పి అది ప్యాసైతే మా ఇద్దరి పెళ్ళికి నీవు ఒప్పుకునేవాడివేనా చెప్పు," నత్తి నత్తిగా, దీనంగా అన్నాడు రాముడు.

రాముడి ముఖాన్నొకసారి, సీత నోసారి ఎగాదిగా చూసి, "ఉండు నీపని చెప్తా నం"టూ చకచకా లోపలికిపోయి, కాగితం కలం తెచ్చి లక్ష్మణుడి కిస్తూ, "వాళ్లి నాన్నకు ఉత్తరం రాయరా," అన్నాడు భద్రంగారు సీరియస్ గా. వణుకుతున్న చేతుల్తో కాగితం కలం అందుకొని, "ఏమి వ్రాయటం," అన్నట్లు చూశాడు లక్ష్మణుడు; ఏమి వ్రాయిస్తాడో అని మనస్సులో శాపనార్థాలు పెట్టూ. ఏం రాస్తాగో, ఏమౌతుందో అని అందరికీ దిగులు పట్టుకొంది.

"మహారాజశ్రీ బావగారికి—

ఉభయకుశలోపరి. చిరంజీవి మా రాముడు..." అని ఆగి రాముణ్ని కొద్ది క్షణాలు తీక్షణంగా చూసి, మీ రాముడికి త్వరగా వివాహం చేయటం ఎంతో అవసరమని, వాడి ప్రవర్తన చెప్తున్నది. అందుచేత మాచిరంజీవి సౌభాగ్యవతి సీతను మీవాడి కివ్వటానికి నిర్ణయించుకున్నాను. మీకు చెప్పవలసిందేముంది. అంతా మీకు తెలిసిందేనాయె. ఈ జాబు అందిన తక్షణం మీరు యావన్మంది బంధుమిత్ర సమేతంగా వచ్చి 'సీతా రాముల' వివాహానికి శుభ ముహూర్తాన్ని నిశ్చయించవలసింది..." అంటూ ముగించి, పకపకా నవ్వాడు భద్రంగారు. అందరూ 'హమ్మయ్య' అనుకున్నారు.

సీత రాముడువైపు చిలిపిగా చూసింది.

"చూశావుగా నా ప్రతాపం" అన్నట్లు రాముడు సీతవైపు చూశాడు.

ఇద్దరి కళ్లు కిలకిలా నవ్వాయి; ఇదంతా చూస్తున్న అన్నపూర్ణమ్మగారు కూతురు బుగ్గలు పుణికింది సంతోషంతో. అంతా ఓకంట కనిపెట్టున్న భద్రంగారు భార్యవైపు చూశాడు, తన పెళ్ళిని గుర్తుకు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తూ.

"ఇంత పనీ నేనేగదా చేయించింది" అని మనస్సులో హాయిగా నవ్వుకున్నాడు లక్ష్మణుడు.

"నా నాయనే, నా బాబే" అంటూ రాముడి ప్రక్కన చేరి వీపు నిమురుతూ మురిసిపోయింది ముసలమ్మ.

కథ కంచికి...మనం ఇంటికి...

*   *   *

భలే భలే అనుకుంటూ శ్రోతలంతా లేచారు.

"తర్వాత ఏమైందేంటి?" లేస్తున్న శ్రోతల్లో ఒకరు అడిగారు.

"ఏమైందా......కళ్యాణం," మరో శ్రోత జవాబిచ్చాడు.

"పరీక్ష పోతే పోయింది గాని పెళ్లయింది భలే. ఇంతకూ ఆ తెలివంతా రాముడి దంటావా, లక్ష్మణుడి దంటావా?" అని ఎవరో మరొకరు అడిగారు.

"ఎవరిదైతేనేం, రాముడుమాత్రం భలేపని చేశాడు," అని సమాధానం వచ్చిందేగాని, ఆ తెలివి కథకుడిదని ఏఒక్కరూ అన్న పుణ్యాన పోలేదు.






# వివాహాలలో ఆచారాలు

ప్రతి జాతీ సంప్రదాయ సిద్ధములైన ఆచారాలతో, విద్యావిజ్ఞాన సాంస్కృతిక కళావైదగ్ధ్యాలతో సంఘజీవనానికి విశిష్టమైన రూపమును కల్పించుకుంటుంది. ఆ సంఘములో అన్ని తరగతులవారు యథాశక్తిగా ఈ విద్యలను, కళలను అలవరించుకొని జీవిస్తూ ఉంటారు. ప్రజల జీవిత విధానములో తరతమ భేదములు పైకికనబడినా ప్రధానసూత్రములో మార్పు ఉండదు. జాతి ఎంత నాగరీకానికి లోబడిపోయినా ప్రాచీనాచారాలను అన్ని విషయాలలో వదలుకోలేదు. అటువంటి వాటిలో వివాహాలకు సంబంధించిన ఆచారాలు ప్రధానమైనవి.

ఆంగ్లేయుల వివాహాలలో ఉంగరము ప్రధానమైనది. ఈ భటువు ఏరకపుదయినా ఉపయోగిస్తుంది. కాని సాధారణముగా బంగారముతో గాని ప్లాటినమ్‌తో గాని తయారుచేయబడిన సాదారకపు ఉంగరాన్నే వాడుతూ ఉంటారు. వరుడు ధనహీనుడయినట్లయితే ఇత్తడి ఉంగరాన్ని ఉపయోగించటము మామూలు. అమెరికాలో వధువు ఎడమచేతి మూడవ వేలికి ఈ ఉంగరాన్ని ధరింపచేస్తారు. వరుడు వధువు వేలికి ఉంగరాన్ని తొడగటమే చట్టసమ్మతమూ న్యాయసమ్మతమూ. కాని చాలామంది పురాతనాచారమునే, అనగా వధూవరులు పరస్పరమూ ఉంగరాలను మార్చుకోవటమనే ఆచారాన్నే సాగిస్తారు.

పెండ్లి ఉంగరము మేలిమి బంగారముతోనే తయారు చేయబడవలెనని శాస్త్రము. కాని మేలిబంగారము మెత్తగా ఉండి సులభముగా అరుగుతుంది కనుక 18 కారట్ వన్నె బంగారాన్ని ఉపయోగిస్తారు. వివాహకాలమందు ధరించిన ఉంగరమును వ్యక్తి

**ఇల్లిందల సరస్వతీదేవి**

మరణానంతరము గాని తీయకూడదని ఆంగ్లేయుల నమ్మకము. తిరిగి వివాహము చేసుకొనవలసిన అగత్యము కలిగినప్పుడు దానిని తీయటము ఆచారము.

తిరిగి వివాహమాడదలచుకొన్న వితంతువు చర్చికిగాని రిజిస్టరు ఆఫీసుకుగాని వెళ్లేముందు ఆ ఉంగరాన్ని తీస్తుంది. చాలామంది చనిపోయినప్పుడు తమతోపాటు ఆ ఉంగరాన్ని కూడా భూస్థాపితము చేయబడవలెనని కోరుకుంటారు. కొందరు తమ సంతానానికి చెందవలెనని విల్లులో వ్రాస్తారు.

మన వివాహాలలో మధుపర్కము ఆడంబరముగాను ఖరీదు కలదిగాను ఉండదు. కాని ఆంగ్ల వధువు ధరించే వస్త్రాల విలువ వాళ్ల ఆర్థిక పరిస్థితుల ననుసరించి ఉంటుంది. వైభవోపేతమైన వివాహాలలో వెలగల అందమైన వస్త్రాలనే ఉపయోగిస్తారు. వధువు యౌవనవతీ, కన్య అయినట్లయితే సామాన్యముగా శ్వేత వస్త్రాలను ధరిస్తుంది. కాని ఈ నియమము అనుల్లంఘనీయము మాత్రము కాదు. అక్కడక్కడ పసుపు నీలము రంగు వస్త్రాలను ధరించటము కూడా ఆచారము. వితంతు వివాహాలలో వధువు తెల్లటి వస్త్రాలను ధరించదు సరికదా మేలిముసుగు (*Veil*) కూడా ఉండదు. కాలానుగుణ్యమైన నాగరీకపు దుస్తులను ధరిస్తుంది. మేలిముసుగుకూ (*Veil*) భుజాలమీదుగా వెనుక జీరాడుతూ ఉండే వల్లెవాటుకూ (*Brides'-train*) సరిపడునట్టిగాను వధువు ధరించాలి గాని మరీ పొడుగుపాటిది గాని పొట్టిదానిని గాని ధరించకూడదు. వివాహపు దుస్తుల నమోనా నిరాడంబరముగా ఉన్నా ఆకర్షణీయముగా ఉండటము ముఖ్యము. సిల్కు, శాటిన్, క్రేపులవంటి బట్టలతో కూడా సిద్ధము చేయబడతాయి. వాటి సరిగకూడా ఉంటుంది.

ఆంగ్లేయులలో గౌనుకంటె, వధువు వల్లెవాటు క్రింద ఉపయోగించే వస్త్రము ఖరీదు కలదిగానే ఉంటుంది. చాలా ఆకర్షణీయముగా ఉంటుంది. అది భుజాలమీదినుండి వెనుకకు చీరకొంగువలె వ్రేలాడుతూ ఉంటుంది. దానిని పట్టుకొని వధువు వెనుక

తోడపెళ్లికూతుళ్లనదుస్తారు. వధూవస్త్రాలు వివాహానంతరము దైనిక జీవితములో ఉపయోగ పడునట్లుగా తయారు చేస్తారు. తెల్లటిగౌను అయినట్లయితే డిన్నరు డ్యాన్సు పార్టీలకు ఉపయోగపడుతుంది. పల్లెవాటు సాయంత్రపువేళ కప్పుకొని వాహ్యాళి వెళ్లటానికి అనువుగా ఉంటుంది. మేలిముసుగు క్రింద ఉపయోగించే బట్ట సాదాగా గాని పువ్వులు కుట్టబడినది గాని గాని ఉంటుంది. ఒక పెద్ద నలచదరపుబట్టను ముఖముమీదినుంచి కప్పి కిరీటమువంటి దానిని తలపైన పెట్టుతారు. వధువు చర్చిలో ప్రవేశించేటప్పుడు ముఖము కప్పబడి ఉండాలి. వివాహానంతరము దానిని తలపైకి వేస్తారు.

ఆంగ్లేయులలో అతిగా నగలను ధరించే ఆచారము లేదు; కనుక వధువు వివాహ సమయములో బహూకరింప బడిన వాటిని స్వల్పముగా ధరించటము మామూలు. వివాహ కాలములో చేతులకు గ్లవ్సు తొడిగికొనే ఆచారము లేదు.

వివాహ ముహూర్తములో వరుడు వధువుకు ఛటువును పూలగుత్తులను ఇస్తాడు. వధువుతో పాటుగా తోడపెళ్లికూతుళ్లకు కూడా ఇవ్వటము ఆచారము. ఇంటినుంచి చర్చికి వెళ్ళేఖర్చు వరునిది. ఇది కాక పెండ్లిలో అయ్యే ఇతర ఖర్చులు కూడా వరునివే. అది సాధారణముగా 1 పౌండు-1షిల్లింగునుంచి 5 పౌండ్లు-5 షిల్లింగుల వరకూ ఉంటుంది. వివాహ కాలములో చర్చిలో గంటలు మ్రోగించేవారికి కూడా వరుడే ధనము చెల్లించాలి. వివాహము లైసెన్సుకు సంబంధించినదయితే దాని క్రింద ఖర్చయే మొత్తాన్ని వరుడే భరించవలసి ఉంటుంది. వివాహము నగరములో జరిగినట్లయితే ఈ ఖర్చు సామాన్యముగా 2పౌ.-2షి.-6పె అవుతుంది; గ్రామమయినట్లయితే 2పౌ.-12షి,-6పె. నుండి 3పౌ.-3షి వరకూ ఉంటుంది. కొత్తసంసారానికి కావలసినసామగ్రినంతా వరుడే అమర్చుకోవాలి. ఈసామగ్రిబహుమానాలక్రిందకూడావస్తుంది

వధూవరులవెంబడి చర్చికి వెళ్లటానికి బ్రహ్మచారినే నియమిస్తారు. ఈబ్రహ్మచారి వరునితో కూడావెళ్లి, చర్చి గేటుదగ్గర కుడిప్రక్కగా నిలబడి వధువు రాకకై నిరీక్షిస్తూ ఉంటారు. వివాహ కాలములో ఇతడు వధువుకు కుడిప్రక్కగా నిలబడి ఉంటాడు. చర్చిలో వివాహ రిజిస్టరులో ఇతడు సంతకము పెట్టవలసి ఉంటుంది.

వధువు తల్లితో గాని తండ్రితో గాని చర్చికి వెళుతుంది. వధువు సోదరిగణాన్నిమనము తోడపెళ్లికూతుళ్లనుగా భావించి నట్టే వాళ్లూ భావిస్తారు. వధువు చర్చి నుంచి వచ్చేసరికి తల్లి తోడపెళ్లికూతుళ్లతో ద్వారము దగ్గర నిలబడి ఉంటుంది.

వధువు వెంట తల్లి చర్చికి వెళ్లినట్లయితే తండ్రి చర్చిదగ్గర నిలబడి స్వాగతమిస్తాడు. తండ్రి కుడిచెయ్యిగాని తండ్రివంటిమరొక వ్యక్తిచెయ్యిగాని పట్టుకొని వధువు వివాహ వేదికను సమీపిస్తుంది. ఆమె వెనుక నుంచి తల్లి తోడపెళ్లికూతుళ్లూ వస్తారు.

వివాహ వేదికకు కుడిప్రక్కగా వరుని బంధువులు, ఎడమప్రక్కగా వధువుబంధువర్గము ఆసీనులయి ఉంటారు. వరుని ఎడమ ప్రక్కన వధువు, ఆమె ప్రక్కన కన్యాదాత వరుసగా నిలబడతారు. తోడపెళ్లికూతుళ్లలో ముఖ్యురాలు పెళ్లికూతురి వెనుక నిలబడుతుంది.

వివాహము కాగానే ముందు మతాచార్యుడు, వరుని ఎడమచేతిని పట్టుకొని వధువు, తరువాత తోడపెళ్లి కూతుళ్లలో ముఖ్యురాలు, తల్లీ, తండ్రీ వరసగా నిలబడి, క్రమముగా రిజిస్టరులో సంతకాలు పెటుతారు. ఆ తరువాత వరుని చెయ్యి పట్టుకొని స్నేహితులతో కరచాలనమైనా చేయకుండా వధువు తోడపెళ్లికూతురితో కారెక్కి వెళ్లిపోతుంది.

వితంతు వివాహాలలో తోడపెళ్లి కూతుళ్లకు ప్రాముఖ్యము లేదు. వివాహపు కేకు కూడా సామాన్యముగానే ఉంటుంది.

వివాహములో రిసెప్షను (విందు) ధన గౌరవాలను బట్టి ఆడంబరముగా ఉంటుంది.

విందు తరువాత వెంటనే వధువు వస్త్రాలను మార్చుకొని మధుచంద్రికకు (Honey moon) సిద్ధమవుతుంది.

వివాహములో కేకు కొరకు పెండ్లివారు చాలా ధనవ్యయము చేస్తారు. దానిమీద గుఱ్ఱపునాడను, వెండిగంటల బొమ్మలను అదృష్ట సూచకములని భావిస్తారు. కేకును వధూవరులు కోస్తారు. ముఖ్యమైనవారికి మాత్రమే దానిని పంచుతారు. ★

వనితాలోకం :

# తిరుగుబాటు

## "కేసరి"

"నా బుజ్జితల్లివికదూ! ఈ ఒక్కసారి నా ముచ్చట తీర్చమ్మా! ఇక మీదట నీయిష్టం, మీ అన్నయ్యయిష్టం! ఈసారి మాబుద్ధి గడ్డితిని వాళ్లను మా గడప త్రొక్కమన్నాం... నా తల్లివికదూ..." అంది కమలమ్మ.

"క్షమించమ్మా! నీవూ, మామయ్యా చేస్తున్న ఈ దౌర్జన్యాన్ని సహించలేను. నాన్న ఉంటే ఈ అక్రమానికి ఒప్పుకొనే వాడేకాదు ... నేను, అన్నయ్యదగ్గర చెప్పి పోయిగా హాస్టల్లోనైనా చేర్తాను - అహో రాత్రాలు ఈ పోరైనా తప్పుతుంది" అని విసురుగా కాలేజీకి పోయింది నిశ్చల. కమలమ్మ నిశ్చేష్టయై సోఫాలో చేరగిలబడింది, కూలబడిపోయినదిక్కే చూస్తూ!

"అదేం? అక్కగారూ! అలా దిగాలు పడిపోయున్నారేం?" అంటూ పొరుగింటి శేషమ్మ కమలమ్మను హెచ్చరించేవరకు ఆమె ఆవిధంగానే కూలబడివుంది.

"రా శేషమ్మా! అలా కూర్చో! ఏదో నామనసే చెదిరిపోయింది ... ఏం ఉంది! ఈయింట్లో అన్నీ విడ్డూరాలే! ఏం చదువులో! ఏంబుద్ధులో!..అన్నకుతగ్గ చెల్లెలూ, చెల్లెలుకుతగ్గ అన్న!! సరిగ్గా కుదిరారు నా ప్రాణానికి...అంతా నా తలవ్రాత! లేకుంటే నన్ను ఏకాకినిచేసి ఆ పుణ్యాత్ముడు తప్పుకునేవాడా?" అని కన్నులు ఒత్తుకుంది.

"ఛాఛా అదేమిటమ్మా కన్నీళ్లు పెట్టుకుంటావు? ముత్యాల్లాంటి పిల్లలతల్లివి, నీకేం కమలమ్మా? ఐనా నీవు చిత్రంగా అంటున్నావే? మురళిబాబంటే ఊర్లో ఎంత పేరు! ఎంతప్రతిష్ఠ! తండ్రికితగ్గ కొడుకని నలుగురూ అంటున్నారు. ఇంత చిగువు చదువుకున్నా రవ్వంత గర్వమన్నా ఉందా? మొన్న ఎవరో మా ఆయనతో అంటూంటే విన్నా 'ఆ మురళిబాబండీ, ఇంత చిన్న వయసులోనే ప్రొఫెసరు పనిచేస్తున్నా - మనుషుల్ని చూస్తే ఎంత మన్నన, ఎంత మర్యాద!' అసలు కాలేజీ కుఱ్ఱవాండ్లు కూడా ఆయన్ను నెత్తిన పెట్టుకొని పూజిస్తూంటారటగా? ... అమ్మాయిమాత్రం? రూపానికితగ్గగుణం...గుణానికితగ్గ చదువూ ......"

"అదేశేషమ్మా నేన నేదినూ! లోకాన్ని మెప్పించారుకాని వాళ్లు కన్నతల్లి గోడైనా వింటున్నారా?...నా మెప్పు అసలు వాళ్లకు అవసరమైతేగా? ... నేనెంతగా తల్లడిల్లిపోతున్నానో, లోలోపల కుమిలిపోతున్నానో వాళ్ళకేం తెలుసు?... ఈడు ముదిరినా, బ్రహ్మచారిముదిరినా పనికిరాదన్నట్లు వాడికిముప్ఫయేండ్లునెత్తికొస్తున్నా ఏమన్నా తెమల్తున్నాడా? ఎన్ని సంబంధాలు! ఎన్ని సంబంధాలు!!... వేలకు వేలిచ్చి రంభల్లాంటి పిల్లల్ని కట్టబెడ్తామని బ్రతిమాలుకున్నవాళ్ళని కాదనేశాడు. పోనీ...నీకు నచ్చిన అమ్మాయేదో అదైనా చెప్పరా అంటే, దానికీ పలుకు ఉలుకూ లేదాయె! పచ్చగా కళకళలాడవలసిన ఇంట్లో ఈ భీష్మించడాలేమిటమ్మా?... సరే వాడు సరే మగవాడనుకుంటే అమ్మాయికి దాదాపు యిరవయ్యేండ్లు దగ్గరకొస్తున్నా దాని సంగతన్నా వాడేమైనా అనుకుంటున్నాడా?...సరి యిక దాని తరహా యిట్లా...అసలు వాడి చనువు చూచుకునే దాని మిడిసిపాటూ, మాట దుడుకూ అంతా!...నీవు చెప్పు శేషమ్మా! పెండ్లి చూపులకని ఎవళ్లో యింటి గడప త్రొక్కవస్తే, ఈ పిల్లదేం పోయిందీ దీని అఘాయిత్యం కాకపోతే, వాళ్ళముందర కనబడటానికి అవమానంట! అగౌరవంట!! నేనూ నా తమ్ముడూ దౌర్జన్యాలు చేస్తున్నాంట! ...ఎందుకులే చెప్పుకున్నా నాకే తలవంపులు!...అయినా ఏదో పచ్చగా వాళ్ళ ముందు కనబడడమేనా?...ఊరేగమన్నామా లేక నాటకమాడమన్నామా, కాలేజీల్లోలాగ?...ఎంత బి ఏ లు, ఎం ఏ లు వెలిగించినా ఈ విపరీతపు పోకిళ్ళేమిటేంట?"

"ఆఁ...ఏదో సిగ్గుపడ్తుంది గావాలెఁ కమలమ్మా! అంత మాత్రానికే నీమాట కాదంటుందా?"

"సిగ్గూ లేదూ, బిటుబండలూ లేదూ! అవంతా వాళ్ళ చిగువులమ్మా, చిగువులు! మనమంతా వాళ్లకు మనుషులక్రింద జమా? మనకు చిగువా సంస్కారమా? ఐనా నేనంటే వాళ్లకి అసలే లెక్కలేదు!...ఏదో నా తమ్ముడంటూ ఒక దుండబట్టి వాడి కడుపు చల్లగా ఈ యింటి వ్యవహారాలూ, పొలము బుట్రా చూచుకుంటున్నాడు....ఆ కష్టిగాడు నలుగురి కాళ్ళావేళ్లాబడి బ్రతిమాలి భంగపడి సంబంధాలు తేవడం, వీళ్లు ప్రతిదాన్ని కాదనడం! వాడు కాబట్టి వీళ్లు ఎంత ఏడిపించుకుతిన్నా, పరిహాసాలాడినా నెత్తి కెక్కించుకుని తిరుగుతున్నాడు!...ఈరోజు సాయంత్రం విజయవాడనుంచి ఒక గొప్పింటివాళ్లని అమ్మాయిని చూడ్డానికని కష్టపడి పిలుచుకొస్తూంటే ఈపిల్ల ససేమిరా నేను సాయంత్రం యింటిపట్టుకూడా రానని ఎగుగుతిరుగుతుందా! భయం భక్తి, మంచీ చెడ్డా, చిన్నా పెద్దా ఉన్నవాళ్లేనాని వీళ్లు?"

"అబ్బెబ్బే! ఏమీ ఆందోళన పడకండక్కయ్యగారూ! అంటారే కాని వయసొచ్చిన పిల్ల అలా ఎందుకు చేస్తుందిలెండి!

సాయంత్రం చక్కగా ముస్తాబై లక్ష్మిలా తయారౌతుంది వాళ్ళొచ్చేలోపుగా! మీ ప్రయత్నాల్లో మీరుండండి ఏదో చనువుకొద్దీ మిమ్మల్ని కొంచెం ఉడికిస్తారంతే!" అని ఊరడించి శేషమ్మ సెలవుతీసికొని వెళ్లింది కమలమ్మ దీర్ఘంగా నిట్టూర్చి, రంగని విగ్రహానికి చేతులు జోడించి, తనపనివైపు మరలింది.

* * *

నిశ్చల మధ్యాహ్నం ఇంటివైపుకూడా రాలేదు హాస్టల్లోనే స్నేహితురాండ్రతో గడిపి కాలంగడిపేసింది. ఆమె హృదయం

భావసంగ్రామంతో కురుక్షేత్రమైంది. అమ్మ కన్నీళ్ళకు భయపడి తల ఒగ్గడమా, లేక తన వ్యక్తిత్వాన్ని, ఆదర్శాలను, ఏమైనా సరేనని కాపాడుకోవడమా? ఆమెకు కర్తవ్యమేమిటో బోధపడడం లేదు.

నిజంగా నిశ్చల ఆదర్శాలలో పుట్టి పెరిగింది. ప్రేమించే అన్నయ్య అడుగుజాడలలో నడుస్తోంది, ప్రతివిషయంలోనూ! తన జీవిత లక్ష్యాలను తీర్చిదిద్ది, తన వ్యక్తిత్వానికొక రూపాన్ని ప్రసాదించినవాడన్నయ్య!

"డబ్బిచ్చి కొనుక్కున్న ప్రేమ! ఛీఛీ! వ్యభిచారానికీ ఈ అమ్ముడుపోయిన మనుష్యుల ప్రేమకి తేడా యేమిటి?" అనుకునేది నిశ్చల కట్నాల ప్రస్తావన వచ్చినప్పుడల్లా! అందుకే కట్నాన్ని కాంక్షించిన యువకులను, ఎంత చదువుకున్నా నిశ్చలంగా తిరస్కరించింది.

నిశ్చల శరీరంమాత్రమే క్లాసులో వుంది. ఆలోచనలన్నీ పరిపరి విధాల రెక్కలు వచ్చినట్లు విహరిస్తున్నాయి. ఎంత ప్రయత్నించినా పాఠాలమీద మనసు లగ్నం కాలేదు.

ఎన్నిమార్లని నీచమైన పెండ్లిచూపుల నే ఈ ప్రదర్శనలకు అంగీకరించడం? చచ్చు ప్రశ్నలు, అంతకంటే అసహ్యకరమైన అష్టప్రశ్నలు! అన్నీ అయిన పిమ్మట బజారుబేరాలు! ఛీఛీ అచ్చం బజారు మనుషులు!!—అనుకుంటూవుంది, యింతలో వీపు మ్రుదుసేసరికి 'అబ్బా' అంటూ వెనక్కు తిరిగిచూచింది నిశ్చల. విమల విరగబడి నవ్వుతూంది. తరగతిలో ఒక్క పెట్టు తేను! ఎప్పుడు గంట కొట్టారో మరి, తన ధోరణిలో తాను పడుందాయె!...విమల తన నోట్సు తీసిచూస్తూ పొట్టచెక్కలయేలా నవ్వుతూంది. తనకేమీ అర్థం కాలేదు సరికదా ఎక్కడలేని చికాకు వేసింది. కోపంతో ఎరుపెక్కుతూన్న నిశ్చల ముఖాన్ని చూచి విమల చేతులు జోడించి నాటకఫక్కీలో "చండిమూర్తీ! భద్రకాళీ! మామీద కన్నెఱ్ఱ చేసి చేయి చేసికోకండి!" అంటూ వేళాకోళం ప్రారంభించేసరికి నిశ్చలకు మరీ రగిలిపోయి హుంకరిస్తూ, విమల చేతిలోని నోట్సుని తటాలున లాక్కుంది. అందులో చూస్తే ఏముంది? కాగితాలనిండా పిచ్చి గీతలు చూచి నిశ్చల వెలవెలబోయింది. విమల మళ్లా విరగబడి నవ్వుతూ "చూచారా మీ చదువు తెలా వెలిగిపోతున్నాయో? ఇల్లా అయితే మీ అన్నయ్యకి తగ్గ చెల్లెలనిపించుకుంటావులే!...ఐనా ఏమిటబ్బా సంగతి? ఈ మతిమరుపూ, పరధ్యాన్నం అదీ, కొంప తీసి ప్రేమకలాపం భామ విలాపం...?"

"ఛీ నోర్ముయ్" అని నిశ్చల విమల జడ పట్టి గుంజి కన్నుల నీరుకార్చడం మొదలెట్టింది.

విమల నొచ్చుకుని "క్షమించు నిశ్చలా! నిన్ను గాయపరిచినట్లున్నాను.....రా, పోతూ మాటలాడుకుందాంలే" అంటూ లాక్కుపోయింది.

"విమలా! నాకొక్క సహాయం చేయవూ నీ మేలెప్పటికీ మరిచిపోను. ఈ రోజుకి మాత్రం నీ రూంలో నాకు చోటివ్వు తల దాచుకోడానికి."

కొయ్యబారిపోయింది విమల. తెప్పరిల్లి "అదేమిటి నిశ్చలా! ఏం జరిగిందేమిటి? ప్రతి విషయంలోనూ మా కెంతో ధైర్యం చెప్తూండేదానివి, నీవే యిల్లా బేలనైనావేం?" అంటూ హాస్టల్లో తన గదిలోకి తీసికొని వెళ్ళింది.

నిశ్చల తన హృదయ భారాన్నంతా ఒక్కమారు తన నెచ్చెలికి వెల్లడించింది. తన నిస్సహాయ స్థితిని తెలిపి కన్నీరు వెల్లువలయ్యేలా వగచింది. అంతా విన్న విమల "నిశ్చలా! నీకు కోపం రాదంటే ఒక్క మాటడుగుతా! నన్ను మాత్రం తప్పుగా అర్థం చేసికోకు! పెండ్లిచూపులకని ఎవడో ఒకడు వస్తే నీకేం? నీట్ గా టాయిలెట్ అయి వాళ్ళముందర కనబడు! తరవాత మీ అమ్మకు చెప్పేసెయ్ కచ్చితంగా నా కిష్టం లేదని! ఇంత దానికే నీవు ఇంతగా క్రుంగిపోయి, ఏదో అవమానం జరిగినట్లు బాధపడడం దేనికి?...అయినా యీ తతంగం అంతా ఇప్పుడు కొత్తనా, తరవాతనా తప్పేది కాదుగా? నీకు నచ్చేవాడొచ్చేవరకు అందరినీ నిరాకరించు! అంతేగా?"

నిశ్చల విషాదంగా నవ్వుతూ "నా ఆవేదన నీకు తెలీడం లేదు విమలా! ప్రతి ఒక్కడూ ఒక గుంపును పిలుచుకొచ్చి మా యింట్లో తిష్ట వేసి బాతాఖానీలు, విందులూ! బుటబొమ్మలా తయారై వాళ్ళముందు నేను నిలబడడం! నేను చెప్తున్నా నమ్మ విమలా! కాలేజీ ఉపన్యాస వేదికమీద, నాటకరంగంలో కూడా నేనంత కంగారుపడలేదు. నా శరీరంలో ప్రత్యణువూ కుంచించుకొని పోతుంది వాళ్ళచూపులతో—సిగ్గుతో, అవమానంతో!!

ఛీఛీ ఆత్మగౌరవంగల ఏ స్త్రీ ఒప్పుకుంటుంది నైచ్యానికి? 'అమ్మాయి ఎంతవరకు చదువుకుందని ఒకడడిగితే' మరొకడు 'కాలేజీ చదువులు చదివినమ్మాయే'నని వెక్కులు చూడడం. 'కర్ణాటక సంగీతం వచ్చా'ని ఒకడు 'ఎంకిపాటలు' వచ్చాని మరొకడు 'అంట్లుతోముడానికి అసహ్యపడదుకదా'ని ఒకడు 'ఆధునిక భావాలున్నాయా'ని మరొకడు వెకిలి నవ్వులు వెలిగిస్తాడు. ఈ అవకతవక ప్రశ్నలకు సమాధానం చెప్పడంకంటే కోర్టుల కెక్కడం ఏమాత్రం తగ్గిపోదు! అంతా అయినవెనక మా వాళ్లూ వాళ్ళూ కలిసి ఎద్దుల సంతలో లాగా బేరాలు సాగించడం! ఈ అన్యాయానికెన్నిమార్లు తలఒగ్గినా ఆత్మాభిమానాన్ని ఖూనీచేసుకోను విమలా?"

"సరే నిశ్చలా! కాని యిందులో నీ వొక్కతెవే ప్రత్యేకంగా అనుభవిస్తూన్న అవమానం యేముంది? ఇది స్త్రీజాతిఅంతా అనుభవిస్తున్నదే!"

"అందుకే నా తిరుగుబాటు తరతరాలుగా నిర్జీవమైపోయిన స్త్రీజాతి యికనైనా ఈ దౌర్జన్యాన్ని ఎదిర్చి తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోవాలి! స్త్రీ పురుషుని ఆటవస్తువుగా వుండడం, అతనికి విలాసాన్ని కలిగించడమే తన జీవిత పరమావధిగా తలుస్తూ తన అభిమానాన్ని, ఆదర్శాలనూ అన్నిటినీ చంపుకొని.....నా హృదయంలోని ఆందోళన నీకు చెప్పలేకుండా వున్నాను విమలా!... నేనిపుడు పెండ్లి పెండ్లంటూ వాచిపోర్చ లేదు...ఎప్పుడైనా వివాహ జీవితాన్నే కోరితే, తన వ్యక్తిత్వాన్ని రూపాయలణాలు పైసలతో కొల్చుకునే పురుషుణ్ణి మాత్రం సహించలేను...అమ్మ అంటుంది - 'మనకుంది మనం యిస్తాం' అని. కానీ ప్రేమను డబ్బుతో కొనుక్కోలేను విమలా! కొనుక్కోలేను..."

"ఎంత అమాయకురాలివి నిశ్చలా నీవు! ఇవన్నీ కాదని నేనను కానీ, నీవూ నేనూ తలక్రిందులు చేసుకున్నా ఈ కుళ్ళిన సాంప్రదాయాలు పోతాయంటావా? ఇలాంటి అభిప్రాయాలు పెట్టుకుంటే 'ఒక్కతెను నాకెల ఓపలేని సుకము' అంటూ జీవితమంతా..."

నిశ్చలఉద్రేకంతో చివాలున లేచి "అక్కడనే మనమంతా పొరబాటుపడి గడ్డి మేస్తున్నామంటాను. ప్రతిమగవాడూ, ప్రతి ఆడది, తప్పనిసరిగా వివాహజీవితానికి తలొగ్గాలని ఎక్కడుంది? మానవత్వపు విలువలు, వ్యక్తిత్వపు విలువలు అన్నిటిని బుగ్గిచేసైనా వైవాహికబంధంలోపడి వురేసుకోపోతే, సంసారధర్మంకంటే మించిన మానవధర్మం లేదని యెందుకనుకోవాలి?"

"ఓస్ అబ్బా! ఉపన్యాసాలు దంచకమ్మా! ఇవన్నీ వినివిని చెవులు దిమ్మెక్కినవేగా! ఇంతకూ మీ అన్నయ్యేమంటాడు? అతనితో నీవు చాలా చనువేగా, నీవేం చెప్పలా?"

"చెప్పకేం విమలా! ఆయనగారి కిదంతా ఒక గొప్ప తమాషాట! జీవితంలో వింత మనుష్యులనూ, వింత మనస్తత్వాలనూ గమనించడానికి మంచిఅవకాశంట! 'ఈతతంగం అంతా సీరియస్ గా తీసికోకు చిట్టీ! నేనిక్కడున్నంతవరకూ నీ యిష్టానికి వ్యతిరేకంగా యెవ్వరూ పోలేరు', అంటాడు ఐనా నేను మాత్రం యిక భరించలేను."

"సరే యిపుడేంచేస్తామని నీవూహ?" -

# ★ తిరుగుబాటు ★

తప్పగా కూలిపోయింది నిశ్చల "అదే విమలా ఏమీ తోచకుండా వుంది. నే నింటికి పోకుండావుంటే యిప్పటికీగండం గడిచినా అందరూ గగ్గోలుపడతారు. అన్నయ్య సానుభూతికూడా ఎక్కడలేకుండా పోతుందోని భయపడ్తున్నాను. ఇంటికివెళ్తేమాత్రం యీ విషమపరీక్ష తప్పదు" అని విమల వొడిలో తలదూర్చి విలపించింది.

విమల ఆలోచించింది.

"నిశ్చలా నాకొక్క ఊహ తట్టింది. గుండె నిబ్బరంకలదానివి కాబట్టి నీవుమాత్రమే యీవిధంగా చేయగలవు" అని నిశ్చల చెవిలో తన వ్యూహాన్ని వివరించింది. తడియారని నిశ్చల కనుగవలో వింత వెలుగు మెరిసింది! కృతజ్ఞతతో నెచ్చెలిని కౌగలించుకొని నిశ్చలంగా ఇంటివైపె నడిచింది నిశ్చల!

* * *

చైతన్యరావు, అద్దెకారులోనుండి కాలు క్రిందికి మోపేందుకు ముందుగానే, ఇంటి వాకిట్లో తనకొరకే ఎదురుతెన్నులు చూస్తున్నట్లుగా నిలుచున్న ఒక మనిషి వినయ విధేయతలతో ఎదురువచ్చి "దయచేయండి బాబుగారూ! దయచేయం"డని చేతులు నులుముకుంటూ నిలబడేసరికి తెల్లబోయాడు అయినా వెంటనే తేరుకొని "ఆఁ...మురళీధరరావుగారిల్లిదేనా?" అనడిగాడు.

"చిత్తం దొరా! మీరు లోపలికి దయచేయండి" అంటూ సామాన్లు లోపలికి చేరవేయడం ప్రారంభించాడు.

చైతన్యరావు లోపల అడుగుపెట్టాడు. కమలమ్మ తొట్రుపాటుతో హాలులో స్తంభపు క్రీనీడలో నిలబడి "రా నాయనా! అలా సోఫాలో కూర్చో" అనంగానే నివ్వెరబోయిన చైతన్యరావు "నమస్కారముండీ" అన్నాడు. కమలమ్మకు బ్రహ్మానందమైంది. "ఒరే సోమప్పా! ఆ పేపర్లూ, మేగజైన్లూ ఆ టేబిలుమీద ఉంచరా! ఆ రేడియో ప్లగ్ తగిలించు!...ఏం సంకోచపడకు నాయనా! అబ్బాయీ అమ్మాయీ యింకా కాలేజీనుంచి రాలే. ఈ రోజైనా కాస్త తెమిలి రండ్రా అని మరిమరి చెప్పాను!......సంగతి సందర్భాలు ఏవి తెలవ్వి పిల్లలకి......సోమప్పా! నీవైనా పోయి వాళ్ళని తీసుకురారా!"

చైతన్యరావు కేమీ పాలుపోలేదు. వేయిప్రశ్నలు బుఱ్ఱలో మెదిలాయి!... కమలమ్మ గొంతు సర్దుకొని, తన సందేహాన్ని వెళ్ళబెట్టింది. "అయినా అబ్బాయీ! నీ వొక్కడివే వచ్చావే? మీ తండ్రిగారూ వాళ్ళూ రాలేదే?" అని.

చైతన్యకు ఈ ప్రశ్నలు అసందర్భంగా తోచినాయి. తన పనిమీద తానొస్తున్నపుడు నాయనలు నాయనమ్మలు రావడం దేనికో అసలు బోధపడలేదు.

"నేనేమైనా కుఱ్ఱవాణ్ణా యేమైనానా నాకు తోడు రావడానికి? వాళ్లింట్లోనే ఉన్నారులెండి" అని వినయంగా సర్ది చెప్పాడు.

కమలమ్మ "ఔనులే! తోడు రావడానికి నీవేమైనా తెలియనివాడివా యేం" అంది పిల్లవాడి చొరవకి, కలగలుపుతనానికి మురిసిపోతూ!

"ఒక్క క్షణం వాళ్లొచ్చేవరకూ ఎలాగో గడుపు నాయనా ఇంతలో వాళ్లూ వచ్చేస్తారులే!"

"నాకేం ఫరవాలేదు లెండి! మీరేం శ్రమ తీసుకోకండి" అన్నాడు చైతన్యరావు, ఈ ఆదరానికి తికమకపడుతూ. కమలమ్మ వంటయింట్లోకి పోతూ అటువైపు మొగమై పత్రిక చదువుకుంటున్న అబ్బాయిని విమర్శనగా చూచి "ఏమైనా చూడు— పెద్దయింటి పెంపకం తరహానే వేరు ఏమి మర్యాద ఏమి వినయం, ఏమి విధేయత..." అనుకొని రంగడికి చేతులు జోడించి "రంగా భారమంతా నీమీదే వేశాం, ఏం చేస్తావో" అనుకుంది.

అటు చైతన్యరావు "హారే భగవాన్! ఏమి మర్యాద! ఏమి ఆదరణ! వీళ్ల దృష్టిలో నే నెవర్నేమిటి? కొంపతీసి పొరబాటేమైనా జరగలేదుకదా?...అబ్బెబ్బే టేబిల్ మీద వాడి ఫోటోకూడా వుంటే!... ఐనా?...సరి...సరి... ఇదంతా మనవాడి కట్టుదిట్టాలు గావల్ను!! శభాష్!" అనుకుంటూ మెల్లగా తనకు తానే నచ్చచెప్పుకుంటున్నాడు.

ఇంతలో వాకిలి మెట్లమీద స్లిప్పర్ల చప్పుడైంది. చైతన్యరావు తిరిగిచూచే లోపుగానే ఆ హాలులో ఒక మెరపు తీగ మెరిసినట్లయింది. చైతన్య కన్నులను బలవంతాన త్రిప్పుకొని పత్రిక పుటలు త్రిప్పుకుంటూ "లేనిపోనిది నెత్తికి తెచ్చుకున్నాను!...మావాడికైనా ముందు రాయకపోతిని...ఈ సస్పెన్సూ... సందేహాలు వుండేవికావు..." అనుకుంటున్నాడు. ఇంతలో ప్రక్కన టేబిల్ మీద చప్పుడయ్యేసరికి, అసలే మునివేళ్లమీద కూర్చున్నవాడాయె, అదిరిపడ్డాడు. ఈసారింతకుముందు తన కనులలో మెరిసిన శంపాలత రూపము దాల్చి నిలబడి తనవైపుకి కాఫీ ట్రే జరిపింది. చూచీ చూడనట్లు ఆమె ముఖంతట్టు చూచాడు. చెదరిన ముంగురులూ, కొంచెమైనా కృత్రిమమైన అలంకారాలు లేని సహజ సౌందర్యమూ! కానీ ఆ విశాల నేత్రాలు అరుణ కిరణాలు వెదజల్లుతూ నిర్లక్ష్యంగా సూటిగా తనలోకి చూస్తూందా అనిపించింది. ఆమె ముఖంలో గంభీరమైన భావోద్వేగం చూచేసరికి చైతన్యరావు హృదయం క్షణం లయ తప్పి పంత పనైంది. ఎందుకంటే వాతావరణ శాస్త్రంలో ప్రత్యేకంగా పరిశోధనలు చేస్తున్న తనకు తెలుసు - బ్రహ్మాండమైన తుపాను లేవడానికి ముందు ప్రకృతిలో అచ్చం అదే లక్షణాలుంటాయని! ఐనా మనసు చిక్కబట్టుకొని - "నావల్ల మీ కందరికీ చాలా శ్రమ కలుగుతూందల్లేవుంది" అన్నాడు.

ఆ చూపుల్లోకంటే నిర్లక్ష్యం ధ్వనించే గొంతుకతో "ఇందులో మాకేం శ్రమ లేదులెండి!...ఐనా ఈ తతంగం అంతా మా కొక అలవాటైపోయింది!.... మీకైనా... ఇది క్రొత్తగాదేమో?.. మీకూ యిలాంటివి నిత్యానుభవాలే అయ్యుండాలి" అంది.

ఈ ఎత్తిపొడుపుతో చైతన్యరావు ముఖం అవమానంతో, ఆక్రోశంతో ఎఱ్ఱబడింది. పరిస్థితి యింతగా పట్టాలు తప్పుతుందని అనుకోనేలేదతడు. మాటలు రెచ్చగొట్టేటట్లున్నా, దిగమింగుకుంటూ, వీలైనంత మర్యాద స్ఫురించేటట్లుగా "క్షమించండి! మీరు నన్నుగూర్చి పొరబడినట్లున్నారు... నేను మీ రనుకొన్నట్లు..."

"క్షమించండి!...ఎవరు ఎవర్ని క్షమించడం? ఎంతకాలమని క్షమిస్తూండడం? ఈ మగజాతిని క్షమించడానికి తగిన క్షమా హృదయం ఉండబట్టే మాకీ దుర్గతిపట్టింది. పొరబాటుపడిందసలు మీరు కానీ నేను కాదు!...మీ రిక్కడికివచ్చేముందే మీ ముఖంమీద— మేమంగట్లో కొనుక్కునే చీరలకు కట్టినట్లు, ఒక అట్ట ముక్కమీద మీ అమ్మకపు వెల వ్రాసి కట్టుకొనొచ్చుంటే వెంటనే నేనే తేల్చి చెప్పేసేదాన్ని— మీ వెల గిట్టుబాటవుతుందో లేదో!... ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు! చెప్పండి— మీ చదువు సంస్కృతి, నాగరకత, సభ్యత, వ్యక్తిత్వం— వీటన్నిటి విలువ ఎన్నివేలు? మీ వెలయెంత?— చెప్పరేం?" అని హుంకరించింది.

చైతన్యరావు విద్యుద్ఘాతం పడ్డవాడిలా కన్నులప్పగించి, విరుచుకొని పడ్తున్న ఆ ప్రళయమారుతంలో, కదలక మెదలక ఉన్నాడు. గుండెలు మాత్రం పందెపు గుఱ్ఱాల డెక్కల చప్పుడులా కొట్టుకుంటున్నాయి. అతని భయమల్లా యే క్షణంలో కిటికీలోని పూలతొట్టె తన నెత్తినపడ్తుందో అనో లేక ఏ క్షణంలో తానూ తన సరంజామా అంతా వీధిలో పడతామో అనో అయ్యుండాలి! ఏ విధంగానైనా ఆ ప్రళయాగ్నికీలను శాంతింపచేసే సదుద్దేశంతో "మీరు ఘోరమైన పొరబాటు పడుతున్నారని చెప్పడానికి విచారిస్తున్నాను... ఒక్క క్షణం శాంతించారంటే మీకు నచ్చ

"చెప్పగలను," అనే లోపుగానే, నిశ్చలకు రోషమూ, కోపమూ ఉప్పెనగా వచ్చాయి. "శాంతించినంత కాలమూ శాంతించాను! ఓర్చుకోవలసినంత కాలం ఓర్చుకున్నాను! నీతీ, నిజాయితీ, ఆత్మగౌరవం ఏవీ రవ్వంతైనా లేని పశువులముందు సిగ్గు, అభిమానాలు చంపుకొని, సింగారించుకొని వాళ్ళ పరిశీలనకు తలవంచాను!... నేను కాదనలేక కాదు!...నా తల్లి కన్నీళ్ళకువెరచి! ఇంట్లో ప్రశాంతానికి భంగం రాకూడదని!...... ఇదుగో ఇది నా తిరుగుబాటు!! పశువుల సంతల్లోలాగా మిమ్మల్ని డబ్బిచ్చి కొనుక్కుంటూన్నపుడు, మీ విలువల్ని, మీ రంగుల్ని, మీ తెలివితేటల్ని పరిక్షించేందుకు వాకూ, అధికారం నాకుంది. అడిగిన ప్రశ్నలకి సమాధానం చెప్పండి—" అంటూ తెచ్చిపెట్టుకున్న హుందాతనంతో, ధీమాతో ఇంతసేపూ నిలబడివున్నది సోఫాలో ఠీవిగా కూర్చొని గంభీరంగా—

"మీ రెంత వరకూ చదువుకున్నారు?"

"ఏం చదువుకున్నారు?"

"మీ చదువు మీ జీవితానికి, మీ లక్ష్యసాధనకు ఏవిధంగా వుపయోగిస్తుందని మీ ఊహ?"

"ఆటల్లో, స్పోర్ట్సులో పాల్గొన్నారా? టెన్నిస్ ఆడడం వచ్చా?"

"మీకు చీట్లాట, సిగరెట్లు, గుఱ్ఱప్పందాలు మొదలైన మంచిలక్షణాలేమైనా వున్నాయా?"

"మీకు మన సంఘంలో, మతంలో పాతుకొనిపోయిన అన్యాయాలను, అత్యాచారాలను, మూఢనమ్మకాలను ఎదిరించడానికి కావలసిన ధైర్యం, సాహసం, మగటిమీ వుందా?"

"మీరు స్త్రీని గౌరవించడమనే సాంప్రదాయం నాగరికతా యేమైనా పాటిస్తారా?"

"పోనీ యివన్నీ తెలియకుంటే మానె... ముదిరిన బెండకాయలని కని పెట్టడంయెట్లా? లేత వంకాయల లక్షణాలేవిటి?

పాతబియ్యానికి కొత్తబియ్యానికీ, తేడా యేమిటి? పొయ్యిలో నిప్పు చేయగలరా?

పాకశాస్త్రంలో యేమాత్రం ప్రావీణ్యం ఉంది? అనే ప్రశ్నలవర్షం కురిపించింది.

చైతన్యకు అంత క్రైసిస్ లోనూ ఆ ప్రశ్నలోని నిశితమైనహాస్యమూ హేళనా బోధపడ్డాయి. నిశ్చల ఆవేశంతో తన్నుతానే మరిచిపోయి యింకా యేదో చెప్తూనేవుంది. చైతన్య ఆవీరమూర్తిని చూచి చకితుడైనాడు. నిశ్చలకంటికొనలలో నీరు నిండింది. గాలి దుమారంలోని లతవలె ఆమె తనువు అల్లాడిపోతూంది. నిశ్చల, యెదుటకూర్చొనున్న చైతన్యనుకూడా మరచి దూరంగా చూస్తూ, రక్తారుణనేత్రాలతో, మాటలనే తూపులుగా పురుషజాతికిపటిన బూజును, దుమ్మును దులిపి, వాళ్ళ నిరంకుశాధికారాన్ని పింజ పింజలుగా చేస్తున్నదా అనిపించింది. చైతన్య ఆ స్త్రీమూర్తిముఖంలోకి నమ్రభావంతో, వర్ణనాతీతమైన గౌరవంతో చూస్తున్నాడు. రౌద్ర బీభత్స రసాత్మకమైన ఆమె ముఖకమలంలో అలసతవల్ల స్వేదబిందువులు ముత్యాలసొంపుకూర్చి వింత సోయగాన్ని దిద్దినాయి.

ఇంతలోనే చైతన్యమెదడులో మెరపులా మెరిసింది - వీళ్లు యెదురుచూస్తూండిన వ్యక్తి తానుకాడనీ, పెండ్లిచూపులకై వచ్చే యే మహాపురుషుడో అయ్యుంటాడని అతని హృదయం ఒక్కసారి నిట్టూర్చింది. వెంటనే చైతన్యలో ఇంతసేపూ భయపడి అడుగునపడి అణిగిపోయున్న చిలిపిదనం కట్టలు త్రెంచుకొంది. పరిస్థితులను క్షణంలో ఆకళింపు చేసుకున్నాడు. అంతేకాదు, యెదుటనున్న అమ్మాయి పన్నిన పన్నుగడ అర్థం కావడంతో, ఆమె ఆదర్శాలెంత వున్నతాలో, ఆమె తెలివితేటలుకూడా అంత సునిశితాలని, ఆమె ధైర్య సాహసాలు అమోఘమైనవనికూడ తెలిసినా యతనికి. ఎంత విచిత్రమైనసన్నివేశంలో తానున్నాడో అర్థంకావడంతో బిగ్గరగా ఒక్కసారి నవ్వాలనిపించింది. కాని అతికష్టంమీద అణిచిపెట్టుకున్నాడు.

నిశ్చల తొణుకూ బెణుకూ లేకుండా, చైతన్య తట్టైనా చూడకుండా "ఈ మగపురుగులికే నీతీ నియమం న్యాయం లేవు! వంకర ముక్కువాడికి, మెల్లకన్నువాడికీ, నత్తివాడికీ, రెండెక్షరాలు చదివి డిగ్రీ ఒకటి తగిలించుకోగానే తానొక మనిషైనట్లు లెక్క! అంతటితో విర్రవీగి, ఇంటింటికి ఉత్సవవిగ్రహంలా తిరుగుతూ, తగుదునని 'నా వెల అయిదు వేలు', 'నాధర పదివేలని ప్రకటించుకోవడం!......ఆ నత్తివాడైనా సరే, మెల్లకన్నువాడైనాసరే వచ్చి 'ఇదుగో చూడు నా వ్యక్తిత్వాన్ని కొలవడానికి ప్రమాణాలు, కొలతబద్దలు లేవు! ఈ విశ్వమే నా హృదయం! నేను నీకివ్వగలిగింది నా ప్రేమ పెన్నిధిని! నాకు కావలసింది నీ నిష్కల్మషమైన హృదయంలో చోటు'-అని అడిగితే పూజిస్తానని యెదురు చూస్తున్నాను!...కానీ...ఛీఛీ...బజారు పురుషులకు నా హృదయంలో స్థానం లేదు..." అని యింకా యేదో చెప్పబోతూనే వుంది...ఇంతలో ఆ నయాగరా జలపాతపు హోరుకు అంతరాయం కలిగింది. "మురళీధర్రావుగారు - టెలిగ్రాం" అంటూ పోస్టుబంట్రోతు లోపలికి వచ్చి నిశ్చలకు టెలిగ్రాం అందిచ్చి వెళ్ళాడు. టెలిగ్రాం కవరు చించుతూంటే ఆమె సున్నితమైన వ్రేళ్లు సొగసుగా ఒణుకుతున్నాయి. టెలిగ్రాం ఒకసారి చదివింది. ఆమె కనుబొమలు ఆశ్చర్యంతో పైకి లేచినాయి. మళ్లా చదువుకుంది. ఇంకొకసారి కూడా చదివింది...ఆమె ముఖం వెలవెలబోయింది. ఆమెలోని యీ మార్పులు తీక్షణంగా పరిశీలిస్తున్న చైతన్యకు ఆమె కాటుక కంటి రెప్పలు త్రుటికాలం పైకిపోయి తనవంక చూచి, తన చూపులతో కలిసికొని మళ్ళా బరువుగా దిగిపోవడం గమనించాడు. చైతన్య "ఇదేదో క్రొత్త కాంప్లికేషన్ లాగుందే! దీని యింప్లికేషనేమిటో?" అనుకుంటూంటే నిశ్చల కలువరేకులవంటి కనురెప్పలను రెపరెపలాడిస్తూ, ప్రాధేయపూర్వకంగా చూస్తూ, బొంగురుపోతూన్న గొంతుకతో "క్షమించండి! మీ రన్నట్లు నేను ఘోరంగా పొరబడ్డాను... నే నెదురు చూస్తూండిన వ్యక్తి మీరే ననుకొని..." అంటూన్నంతలో మురళీధర్ బూట్లు టకటకలతో లోపలికొచ్చాడు- "ఏమిటి చిట్టీ! క్షమించడ మేమిటి? ఎవరిని? ఎందుకు?... ఓరి పిడుగా! నీవెప్పుడూడిపడ్డావురా?" చైతన్య సోఫాలోంచి ఒక చిన్న దుప్పిగంతేసి మురళీధర్ని కౌగిలించుకుంటూ "అరే భాయీ! ముందర చెప్పరా! నాకు వంకర ముక్కుందా? మెల్లకన్నుందా లేక కుంటికాలేమైనా వుందా?"

మురళి విరగబడి నవ్వుతూ - "నీ హాస్యం పాడుగానూ! వచ్చీరాకముందే ప్రారంభించావుట్రా నీ వేళాకోళాలు?...ఆఁ... ఆఁ...అదేమిటి చిట్టీ! ఆ కన్నీళ్ళేమిటేఁ?.. ఒరేయ్ మా చిట్టిని నీవేం వేపించుక తిన లేదు కదా?....ఏం జరిగింది చిట్టీ?..."

"చెల్లెల్ట్రా బ్రదర్! భగవాన్! తుఫానురా...బ్రదర్...టైఫూన్!" అన్నాడు చైతన్య వణికిపోతూ.

"అసలేం జరిగిందిరా? ఏదో గ్రంథం వుందల్లే వుందే?"

"తిరుగుబాటురా బ్రదర్ తిరుగుబాటు! కాదు కాదు తిరుగుబాటులో పొరబాటు!" అన్నాడు చైతన్య సీరియస్ గా ముఖం పెట్టి!

నిశ్చల యింక తట్టుకోలేక అన్నయ్య చేతిలో టెలిగ్రాం పెట్టింది గుట్టుగా. మురళి భుజాలమీదుగా చైతన్యకూడా చదివాడు. సరి - యిక యిల్లంతా దద్దరిల్లిపోయేట్టుగా, ఉరుము లురిమినట్లుగా, ఒకరి నొకరు పట్టుకొని, సోఫాల్లో కూలబడి, మురళి చైతన్యలు విరగబడి నవ్వడం మొదలెట్టారు. నిశ్చల ముఖం కందగడ్డైపోయింది సిగ్గుతో అవమానంతో, గిరుక్కున తిరిగి లోపలికి పరిగెత్తింది.

ఒక చేత్తో విసనకఱ్ఱ, మరొక చేత వేపుడు గరిట ధరించి హడావిడిగా కమలమ్మ లోపలికి ప్రవేశిస్తూ "అమ్మో! అమ్మో! ఎంత

(48-వ పేజీ చూడుడు)




# నాన్నారి జాబు

కవిరావు

ఎన్నడు లేనట్టి దిగులు
ఏలనీకు? చెప్పవమ్మ!

కదలక మెదలక యుందువు
యెద లో తీరని బాధతో.
వానవచ్చి తడియుచున్న
గాని మాటలాడవేమి?

గడియారము కొట్టెనాల్గు
గంటలదుగో! స్కూలునుండి
అన్న వచ్చు వేళాయెను
అన్న మెరుగ వింతవరకు.

సంతోషం బసలెరుగవు
చింతగ గూర్చుందువెపుడు,
చెప్పవె నాన్నారి జాబు
చేర లేద? నేడునీకు.

సంచిలోని వందరకును
పంచిపెట్టు పోష్టువాడు
చదువుకొనుట కతడు నాన్న
జాబులన్ని దాచుకొనును.

తెల్లకావు లాకదస్తా
తెప్పించవె దాదితోడ.
నాన్న ఉత్తరాలన్నియు
నేనె వ్రాతునమ్మ నీకు

అక్షరాలు నాకువచ్చు
'అఆ' నుండియు 'ఏఘ' వరకు,
నవ్వెద వేమిటి కమ్మా
నాకు చేతగాదనేనా?

అడ్డముగా రూళ్లుకొట్టి
అచ్చుగుద్ది నట్లు వ్రాతు
చిక్కు లేక విడివిడిగా
చెక్కెద పెద్దక్షరాలు.

పూర్తిజేసి నాన్నలాగ
పోష్టువాని కివ్వనమ్మ
నాన్నలాగె నన్నుపిచ్చి
వానిగ భావింపకమ్మ!

ఆగకుండ వచ్చి నేను
అపుడే నీకిచ్చివేసి
చెప్పుచుందు ప్రక్కనుండి
తప్పులుపోకుండ నీకు

మంచి మంచి ఉత్తరాలు
సంచిలోనె దాచుకొనుము
అమ్మా! మనపోష్టువాని
నమ్మరాదు! నమ్మరాదు!!

[ఆధారము: టాగోర్



# టీకప్పులో తుపాను

మూలం:
ఐ. ఏ. విలియమ్స్

అనుసరణ:
మధురాంతకం రాజారాం

శ్రీ యస్. వి. కమలాకరరావు గారు ఉన్నట్టుండి సందిగ్ధావస్థలో పడిపోయారు. ఆయన ఇంటినుంచీ పదిగంటలకు ఆఫీసుకు రాగానే, గణ గణ మని ఫోను మ్రోగింది. రిసీవరును చెవిదగ్గర ఉంచుకుంటూ ఆయన "ఎవరూ?" అని నింపాదిగా ప్రశ్నించారు. ఆయనెంత నెమ్మదిగా ప్రశ్నించారో, అంతకంగారుగా జవాబు వచ్చింది. "రామవరంలో దొమ్మీ జరుగుతోంది. పంచాయితీబోర్డు ఎలక్షను సందర్భంలో ప్రారంభమయిన చిన్న కలత చేటికి పరిపూర్ణమైన క్లయిమాక్సు అందుకున్నది. ఇరువైపులా రెండు వందల మంది కర్రలతో, కటారులతో యుద్ధరంగంలో దూకి ఢీకొనబోతున్నారు. అర్జెంట్, అర్జెంట్ వెంటనే రిజర్వు పటాలాన్ని పంపాలి."

ఆదెబ్బతో రావుగారు కాలింగు బెల్ను వడివడిగా నొక్కి, పిలుపందుకుని పరుగెత్తి వచ్చిన జవానుతో "డ్రయివరెక్కడున్నాడో చూడు. కారుని నిమిషాల్లో రెడీచేయమను" అన్నారు.



రాగ సుధారసపానము జేసి
రంజిల్లవే ఓమనసా!......

ఫొటో: బి. రవీంద్రనాథ్—గుంటూరు.

ఐదు నిమిషాల్లో ఆఫీసు ముందు కారు ఆగింది. రిజర్వు పటాలాన్ని తన వెనువెంటనే బయలు దేరి రమ్మని ఆనతిచ్చి రావుగారు కారులో కూచుని దభేలున తలుపు వేసి "ఊఁ స్టార్ట్ చెయ్" అని డ్రయివరును వేగిరించారు. డ్రయివరు కాలితో మరనునొక్కి, చక్రాన్ని త్రిప్పి కారును స్టార్టుచేసి సింహద్వారం దగ్గరికి పోయేసరికి "సార్, సార్" అంటూ పోస్టుమేన్ అక్కడికి పరుగెత్తుకొచ్చాడు.

కారు ఆగింది. డి. యస్. పి గారు చిరాకుతో "ఏం వుత్తర మయ్యా అది! ఆఫీసులో యివ్వకూడదూ!" అన్నారు. "ఒకసారి అలా యిచ్చినందుకు తమరు కోప్పడ్డారండీ! అందుచేత..." అని నసుగుతూ పోస్టుమేన్ వుత్తర మందించాడు. ఆ వుత్తరం కళ్ళబడే సరికి రావుగారు ఒక క్షణంపాటు రిచ్చ పడిపోయారు. అది ఆతురతగా ఆయన ఎదురుచూస్తున్న వుత్తరం. అది రాబోతుందన్న వార్త రెండురోజులకు ముందే ఆయనకు అందింది. ఉత్తర దేశంలో ఎన్నో చోరీలు చేసి, ఫోర్జరీ సంతకాలతో బ్యాంకుల్ని దోచుకున్న గజదొంగల ముఠా ఒకటి ప్రస్తుతం తన ఏరియాలో మకాం వేసినట్టు, వారి ఆచూకీకి, ఆకారానికి సంబంధించిన ఆనవాళ్లతో కొంత రికార్డు తనకు పంపబోతున్నట్టు ఇన్స్పెక్టరు జనరల్ వారి కార్యాలయంలోవున్న ఆత్మీయుడొకడు ఆయనకు ఫోన్లో కబురుచేశాడు. ఐతే ఆవుత్తరం అంత తొందరగా తనచేతికి రాగలదని రావుగారు ఊహించలేదు. ఇప్పుడా వుత్తరాన్ని తనతోబాటు క్యాంపుకు తీసుక పోవడమా, లేక ఆఫీసులోఉంచి వెళ్ళడమా అని ఆలోచిస్తూ ఆయన కొంతసేపు మౌనంగా కూర్చున్నారు.

సరిగ్గా ఆసమయానికి రెండు రోజులపాటు సెలవు తీసుకుని కులాసాగా కాలక్షేపం చేయడానికి పట్టణంలోకి వెళ్తున్న సబ్ యిన్స్పెక్టరు శంకరనారాయణ అలా వెళ్తూఉండి డి. యస్. పి. గారు కారులో ప్రత్యక్షం కాగానే తను సివిల్ డ్రస్సులోవున్న మాటకూడా మరచిపోయి అటెంషన్లో నిలబడి 'గుడ్ మార్నింగ్ సార్' అంటూ సెల్యూట్ చేశాడు. "ఇదిగో శంకర నారాయణా! నీ వినయానికి సంతసించాంగానీ, యిలారా. ఈ ఉత్తరాన్ని తీసుకెళ్ళి..." అని రావుగారు మళ్లీ ఆలోచనలో పడ్డారు.

ప్రమోషన్ కోసం కలలుకంటూ, అధికారి అనుగ్రహంకోసం అర్రులు చాస్తున్న శంకరనారాయణ వినమ్రంగా చేతులు కట్టుకుని "పోస్టు చేయమంటారా సార్" అన్నాడు.

"అంతే, అంతే. నీదెప్పుడూ కొంపముంచే మాటమయ్యా, శంకర నారాయణా! ఇదిప్పుడే పోస్టుమెన్ తెచ్చియిచ్చినవుత్తరం" అని కొంత సేపుఆగి "చూడు. దీన్ని ప్రాణంతో సమానంగా చూచుకోవాలి. జేబులోఉంచుకో. సాయంత్రం ఐదు గంటలకు సరిగ్గాదీన్ని నాకందజేయాలి. అన్నట్టు నువ్వీపెళ్ళి కుమారుడి దుస్తుల్లో ఉన్నావేం! ఎక్కడికైనా షికారీ చిత్తగించడం లేదుగదా!" అన్నారు.

అంతకు ముందురోజు తనకులీవు శాంక్షనుచేసిన డి. యస్. పి. గారు నేడావిషయం తమకు బొత్తిగా తెలియనట్టు మాట్లాడుతున్నందుకు ఆశ్చర్యపడి శంకరనారాయణ "అబ్బే...లేదండీ! మరి...ఈరోజు అంటూ ఏంజవాబుచెప్పాలో స్ఫురించక కంగారుపడిపోసాగేడు.

శంకరనారాయణ సంజాయిషీ వినిపించుకోడానికి తీరికలేక రావుగారు వుత్తరాన్ని అతడిచేతికిచ్చి, అంతటితో ఆవుత్తరం సమస్య పరిష్కారమైపోయినట్టు "ఊఁ కదిలించవయ్యా నీరథం" అని డ్రయివరకు హుకుంజారీ చేశారు.

శరవేగంతో పరుగిడి పోతున్న కారుని చూస్తూ శంకరనారాయణ అక్కడే నిలబడిపోయాడు. కొంత కాలంనుంచీ పైఅధికారి కెందుకో తనపైనఎనలేని ఆదరం కలిగినట్టు అతడికో అనుమానంవుండేది. ఆ అనుమానం కాస్తా నేటికినిజమై పోయింది. ఎంతనమ్మకం లేకపోతే ఆయన ఈ వుత్తరాన్ని తనచేతికిచ్చి వెళ్ళిపోతాడు! పైగా ఇదిప్రాణంతో సమంగా చూచుకోవలసిన వుత్తర మట!

శంకరనారాయణ మనోవీధిలో ఉన్నట్టుండి మరో అద్భుతమైన ఆలోచన విద్యుల్లతలా మెరిసి పోయింది. డి. యస్. పి. గారు తనకు దూరపుబంధువని తల్లి చెప్పగా ఎన్నోసార్లువిని, అందువల్ల మనకు ఒరిగేలాభ ముందిలే అనుకునేవాడు. ఆదూరపు బంధుత్వం దగ్గిరిబంధుత్వంగా మారేఅవకాశంఉందన్న దురాశ అతడిలో ఆక్షణంవరకూ మొలకెత్తలేదు. ఈ విచిత్రప్రపంచలో ఎలాంటిఅనూహ్య

మైన విషయాలు జరిగి పోతాయబ్బా! రావుగారికి పెళ్ళీడువచ్చిన కుమార్తెఉంది. గానోత్సవాల సందర్భంలో ఆసంగతి శంకరనారాయణకు తెలిసింది ఆమె ఎంతకమ్మగా పాడుతుంది!

నేలపైననిలబడిన శంకరనారాయణ అలాగే ఆకాశానికి ఎగిరిపోయి అప్రయత్నంగా నోరు తెరచి "చక్కనైన చుక్కలోన ఒక్కసారి దూరెదా" అనిపాడుకో సాగాడు. ఇంతలో బాంయ్‌బాంయి మని పోలీసులారీ హారన్ ఊదుకుంటూ అటువైపువచ్చి శంకరనారాయణని పరధ్యానంలో నుంచి ప్రపంచానికి తెచ్చింది. అతడు మెల్లగా రోడ్డు పైకి వెళ్లి నడవ సాగేడు.

శంకరనారాయణ ఎర్రగా, పొడుగ్గా, సన్నగాఉంటాడు. ఖాకీ యూనిఫారమ్ కన్నా మామూలు సివిలుడ్రస్సు అతడికి బాగుంటుంది. వదులు పాటి పైజమాపైన మోకాళ్లవరకు వచ్చే జుబ్బాను తొడుక్కుని మెడలోమఫ్లరు వేలాడగా చెంపకు చేరజేసిగాడున్న కళ్లని నల్లద్దాల కళ్లజోడులో దాచుకుని సన్నగా ఈలపాట పాడుకుంటూ వీధిలో నడుస్తుంటే షూటింగు తర్వాత మేకప్‌తో సహా బయటికివచ్చిన సినిమానటుడిలా ఉంటాడు శంకరనారాయణ!

శంకరనారాయణ కాలేజిలో వృక్ష, జంతుశాస్త్రాల్ని క్షుణ్ణంగా చదువుకున్నాడు. దేశంలోనిమారుమూలల్లోవున్న మహారణ్యాల్లో తిరుగుతూ కొండకోనల రామణీయకతను, సెలయేళ్లదాపున అల్లుకున్న పొదల్లో పూచినరంగురంగుల పుష్పగుచ్ఛాలను చూస్తూ జీవితాన్ని తీయగా, హాయిగా గడిపివేయాలని అతడుకనిన పగటికలలన్నీ కల్లలైపోయాయి. తదితర మానవులకు, తమకుఏమాత్రం భేదమూ లేక వారిలోకలిసి పోయేదొంగల్ని కనిపెట్టడానికి కావలసిన మాయోపాయాలు, పాపం శంకర నారాయణకు తెలియనివిద్యలు! వీలుదొరికినప్పుడల్లా అతడు సెలవుమంజూరు చేయించుకుని విశాల ప్రపంచలోకి వెళ్లిపోతుంటాడు.

ఐతే ఈసారి శంకరనారాయణకు దొరికిన సెలవు రెండంటే రెండు రోజులు మాత్రమే! మనోజ్ఞమైన ప్రకృతి దృశ్యాలు అంత స్వల్ప వ్యవధిలో చూచి రావడానికి అందుబాటులో లేవు. అందుచేత శంకరనారాయణ పట్టణంలోకల్లా పొడుగాటి చెట్లతోనూ, దట్టమైన పొదరిండ్ల తోనూ, వివిధ జంతు

# ★ టీ కప్పులో తుపాను ★

వర్గాలతోనూ నిండి ఒక విధంగా అరణ్యంలా కనిపించే మృగశాల వైపుకు దారి తీశాడు

నాలుగణాల ప్రవేశ రుసుము చెల్లిస్తూనే శంకరనారాయణ "ఇటీవల క్రొత్తగా ఏవైనా జంతువులు తెప్పించబడ్డాయాండీ" అని గుమాస్తాని ప్రశ్నించాడు

"అదేమిటండీ, క్రొత్తగా అడుగుతున్నారు! పత్రికల్లో కూడా ఫోటోలు ప్రకటించామే! ఉత్తర దేశంనుంచి వేలురకపు నెమళ్లు వచ్చాయండీ" అన్నాడు గుమాస్తా.

శంకరనారాయణ దోవప్రక్కన బోనులో ఉన్న మృగాల్ని చూచుకుంటూ ఒక ఫర్లాంగు దూరం మెల్లగా నడిచాడు అక్కడ చేవలకు, తాబేళ్ళకు నిర్మింపబడిన జలాశయం ఒకటుంది. ఆజలాశయం చుట్టూ కానుగచెట్ల చల్లటి నీడ క్రింద శిలావేదికలు అమర్చబడి ఉన్నాయి "అబ్బా! ఎంతచల్లగా ఉందిక్కడ! ఇందుకేనేమో కానుగ చెట్టు, కన్నతల్లి సమానం అన్నారు పెద్దలు" అనుకుంటూ శంకరనారాయణ ఒక రాతి బెంచీపైన పడుకున్నాడు.

పడుకుని పైకి చూచేంతవరకూ శంకరనారాయణ ఉత్తర దేశపు నెమళ్లు కానుగ చెట్లపైన కొలువు తీరి వుంటాయనుకోలేదు. అబ్బో! ఆ నెమళ్ళ అందచందాల్ని చూచినట్టయితే భగవంతుడి సృష్టి రామణీయకతకు విస్మయపడని మానవుడెవడుంటాడు! అందులోనూ కవి కుమారుడు కావడానికి బదులు గ్రహచార వశాత్తుగా హెడ్ క్లార్కుగా ఉద్యోగయాత్ర ప్రారంభించిన శంకరనారాయణ కమ్మని వాసనలు చిమ్ముతున్న కానుగ పూత మధ్య కూర్చుని ఉన్న మత్తమయూరాల్ని చూచి ఆనంద పరవశుడైపోయాడు.

నెమళ్లు కంటికి కనపడగానే శంకరనారాయణ "ఇవి పురి విప్పి ఆడితే ఎంత బాగుండును!" అనుకున్నాడు. ప్రకృతి సౌందర్యాన్ని చూడ్డంకోసం తపించిపోయే తనలాంటి ప్రేక్షకుడిముందు నాట్యం చేయడానికి అవకాశం లభించినప్పటికీ ఆసంగతి పట్టించుకోకుండా నెమళ్లు వృధాగా కాలం గడిపి వేస్తున్నందుకు అతడు వాటిపై జాలిపడ్డాడు కూడా!

ఇంతలో ఒక మయూరం క్రిందికి దూకింది. శంకరనారాయణ లేచి కూర్చుని "నటన మాడవే, మయూరి, నటనమాడవే" అని పాడసాగాడు. కానీ మయూరానికు మానవ భాష తెలియదేమో! అది శంకరనారాయణ పాటని నిర్లక్ష్యం చేసి ఒయ్యారంగా అటూ ఇటూ పచారు చేయసాగింది

అప్పుడు శంకరనారాయణకు నెమలిని ఆకర్షించడానికి మరో చక్కని ఉపాయం స్ఫురించింది జేబులోఉన్న చాక్ లెట్ ముక్కను పైకి తీసి అతడు బెంచీకి దగ్గరగా నేల పైన విసిరాడు నెమలి పరుగెత్తి వచ్చి దాన్ని ముక్కున కరచుకొని మింగివేసి శంకరనారాయణకు కృతజ్ఞత చూపించడానికా అన్నట్టు మెల్లగా పింఛాన్ని విప్ప సాగింది.

నాట్య ప్రదర్శనం ప్రారంభం కాబోతోందనగా అక్కడో చిన్న ప్రమాదం జరగడానికి ఆస్కారం ఏర్పడింది. చాక్ లెట్ ను బయటికి తీస్తున్నప్పుడు దానితో పాటు డి. యస్. పి. గారి అమూల్యమైన ఉత్తరంకూడా జేబిలోనుంచి జారి నేలపైనబడి గాలిలో అటూ ఇటూ కదలసాగింది. నిజమాలోచిస్తే ఆ వుత్తరం జేబులో నుంచీ జారి నేలపైన పడడం ఏమంత ప్రమాదంకాదు. కానీ ఆ వుత్తరాన్నికూడా చాక్ లెట్ గా భావించి నెమలి దాన్ని కాస్తా ముక్కున కరచుకుని మింగివేయబోయేసరికి నిజమైన ప్రమాదం జరుగబోతోందన్న సంగతి శంకరనారాయణకు తెలిసి వచ్చింది. ఉత్తరం క్రింద పడిందన్న విషయం అతడికంతవరకూ తెలియదు అది జేబులో భద్రంగా ఉందనే అతడు భావించాడు. ఉన్నట్టుండి అది నెమలి ముక్కులోనుంచి ప్రత్యక్షం కాగానే అతడు కుప్పించి ఎగిరి నెమలిదగ్గరదూకి కవరును లాక్కోబోయాడు.

హఠాత్తుగా మనిషి తనపైకి వచ్చేసరికి నెమలి బెదరి పరుగు లంకించుకుంది. శంకరనారాయణ దాన్ని వెంబడించాడు. కానుగ చెట్లమధ్య నెమలికీ శంకరనారాయణకు రెండు నిమిషాల సేపు తీవ్రమైన రన్నింగు రేసు జరిగింది కాని అందులో గెలుపు ఎవరిదో తేలకముందే డి. యస్ పి. గారి వుత్తరం నెమలి ముక్కులో నుంచీ జారి దానిలోలోపలి జీర్ణకోశంలో పడి పోయింది

'ఇప్పుడేం చేయాలి' అన్న భీకర సమస్యని ముందుంచుకుని శంకరనారాయణ చింతా క్రాంతుడై నిల

బడిపోయాడు. కవరునుపలహారంగా వినియోగించుకున్న నెమలి మాత్రం నిశ్చింతంగా అక్కడే నడయాడసాగింది. శంకరనారాయణ తీవ్రంగా ఆలోచించసాగాడు. నెమలి కడుపులో ఉన్న పుత్తరం తనచేతికి రాకపోతే, తనింక అక్కడనుంచి వెళ్ళడంవల్ల లాభం లేదు. అంతటితో తనవుద్యోగమూ, తన భవిష్యత్తూ సర్వనాశన మైపోతాయి.

శంకరనారాయణ ఒక్క ఉదటున ముందుకుదూకి పరధ్యానంగా వున్న నెమలిని చేజిక్కించుకుని ప్రాకారం దగ్గరికి పరుగెత్తాడు. ముక్కుతో గీకుతూ, రెక్కలతో కొడుతూ ద్వంద యుద్ధానికి తలపడిన నెమలిని విడిచి పెట్టకుండా ముందుకు పరుగెత్తడం శంకరనారాయణకు అంత సులభసాధ్యంగా కనబడలేదు. సింహద్వారం గుండా పలాయనం చేయడానికా వీలులేదు. అక్కడెప్పుడూ కాపలా వాళ్లుంటారు. ఇక కాంపౌండు గోడ పైకెక్కి దూకడంకన్నా గత్యంతరం లేదు. అదృష్టవశాత్తు ఒక వేప చెట్టుకొమ్మ గోడపైకి వంగిఉండడంచూచి, శంకరనారాయణ తన చిన్ననాటి వృక్షారోహణ సామర్థ్యాన్ని ఉపయోగించి చెట్టుపైకి ప్రాకి కొమ్మపైనుంచి గోడపైకి వచ్చి అక్కడినుంచి రస్తాలో దూకాడు.

రస్తాలోపడిన తర్వాత శంకరనారాయణకు తనను ఎదుర్కొంటున్న సమస్య మరింత భయంకరంగాతోచింది.

నడివీధిలోపడి ఎక్కడికిపరుగెత్తడం? ఎలా పరుగెత్తడం? పట్టపగలే మృగశాలకు సంబంధించిన నెమలిని తస్కరించుకుని పారిపోతున్న దొంగను ఎదురైనవారు ఎదురైనట్టే చావదన్నరని నమ్మకంఏమిటి?

ఈ విపత్కరపరిస్థితిలో శంకరనారాయణకు ఒక టాక్సీడ్రయివరు ఆపద్బాంధవుడిలా తోడ్పడ్డాడు. తప్పించుకుని పారిపోవడానికి ప్రయత్నిస్తున్న నెమలితో పేవ్‌మెంటు పైన కుస్తీపడుతున్న శంకరనారాయణని చూచి టాక్సీడ్రయివరు ఆశ్చర్యంతో టాక్సీనిలిపి "ఏమండోయ్, నెమలిజూలోనుంచి పారిపోయి వచ్చిందేమిటి?" అన్నాడు. "ఆఁ ఏమిటీ? అవును. అఁహఁ, కాదు" అంటూ శంకరనారాయణ టాక్సీలో దూరి నెమలిని సీటుక్రింద దూర్చబోతూ "డ్రయివర్! ఇప్పుడుమరేం మాట్లాడకు అంతా తరువాత చెబుతాను, ఊఁపోనీ, అర్జంట్" అన్నాడు. డ్రయివరుకు శంకరనారాయణవాలకం అనుమానాస్పదంగాతోచింది. అతడు నెమ్మదిగా "అయ్యా! ఇప్పుడంత తొందరేముందండీ? ఇంతకూ ఎక్కడికి వెళ్లాలంటారు?" అన్నాడు.

శంకరనారాయణ ముందుకు వంగి "డ్రయివర్! అదంతా ఏమీ అడక్కు. నీకు మామూలు ఛార్జికన్నా మూడింతలు ఎక్కువగా ముట్టజెప్పుకుంటాను. ఆలసించడం అపాయకరం! పోనీయ్, పోనీయ్" అని బ్రతిమాలుకున్నాడు. ఈ మంత్రం డ్రయివరుమీద బాగా పనిచేసింది. టాక్సీకదిలింది.

ఆనాటి టాక్సీప్రయాణం శంకరనారాయణకు గాని, డ్రయివరుకు గానీ అంతెందుకు ఆనోరూ వాయీ లేనిపక్షికి గానీ జన్మలోమరచి పోగలిగింది కాదు! అంతవరకూ తాబేలు నడకలా పురోగమించే కోల్‌గాసు మోటారు బండిలోనైనా ప్రయాణం చేసిఎరుగని ఆనెమలికి టాక్సీప్రయాణం ఎంతభయావహమైందో గానీ, అది ఒక్కపెట్టున పైకెగిరి రావణుడితో జటాయువులా శంకరనారాయణతో ఢీకొన్నది. ముక్కుతో అదిపొడిచిన ప్రతిచోటా అతనిదుస్తులు చీలికలు వాలికలుగాచినిగిపోయాయి. దాని అరుపు కర్ణకఠోరంగా వినిపించిన ప్రతిసారీ టాక్సీడ్రయివరు గుండె జల్లున సాగింది. టాక్సీలో పక్షి గందరగోళాన్ని చూచి త్రోవపొడుగునా మనుషులు విస్తుపోసాగారు. దాన్ని తిలకించిన పోలీసులేమో జేబుల్లోంచి డైరీలను తీసి టాక్సీ నంబరు నోట్ చేసుకున్నారు.

టాక్సీలో కూర్చుని శరవేగంతో పట్టణాన్ని ప్రదక్షిణం చేస్తూ ఉన్నంత మాత్రంచేత శంకరనారాయణ సమస్య పరిష్కారమైపోలేదు. ఇలా ఎంతసేపు తిరగాలి? ఈనెమలిని ఏంచేయాలి? చేయడానికి మరేముంది' తొందరగా దాన్ని హతమార్చడం తప్ప! ఒకటి రెండుగంటల్లో నెమలి జీర్ణకోశంలోని వుత్తరం పూర్తిగా రూపు మారిపోవచ్చు, ఆతరువాత దాని ప్రాణం తీయడంవల్ల తనకు కలిగే లాభమేమీ ఉండదు. ఆలోపలే ఈ మయూరమారణహోమం నిర్విఘ్నంగా జరిగి పోవాలి! దాన్ని ఎలాజరపాలి? అది తనచేతనైనపనికాదు (శంకరనారాయణ జన్మతహా శాఖాహారి!) సమయానికి ఎవ్వరైనా కసాయివాడు తోడ్పడకూడదూ? తన స్నేహితుల్లో లెక్చరర్లు, డాక్టర్లు లాయర్లు ఎందరో ఉన్నారు. కసాయివాడొక్కడూ లేడు. ఎంత దురదృష్టం!

## టీకప్పులో తుపాను

టాక్సీ ఒక పెద్ద రోడ్డులోనుంచీ చిన్న సందులోకి మళ్ళి పరుగెడుతూ ఉండగా శంకరనారాయణకు ఒక ఆలోచన తట్టింది. ఆవీధిలో అతడికొక డాక్టరు మిత్రుడున్నాడు. ఆపరేషను కేసులలో అఖండుడుగా పేరుమోసిన అతడు నెమలి గర్వాన్ని ఛేదించలేకపోతాడా అనుకుని శంకరనారాయణ "ఈవీధిలో 44 నెంబరుఇంటి


















దగ్గర టాక్సీ నిలుపు" అని డ్రయివరుకు ఆన తిచ్చాడు.

'డాక్టరు వి. యస్. చలం. ఎం. బి. బి. యస్" అన్న బోర్డు వ్రేలాడుతున్న ఇంటిముందు టాక్సీ ఆగింది. శంకరనారాయణ నెమలిని బాహు బంధంలో ఇరికించుకుని తిరిగి చూడకుండా భవనంలోకి పరుగెత్తి మందుల్ని కలుపుతున్న డాక్టరుగారి ముందు కుర్చీలో కూలబడ్డాడు.

"ఏమిటిది శంకరనారాయణ గారూ! తమరు దేనిపైనవచ్చారు?" అని ప్రశ్నించాడు డాక్టరు చలం ఇంచుక విస్మయంతో.

"టాక్సీలో" అంటూ శంకరనారాయణ ఎదుటఉన్న నిలువుటద్దంలో తన దుస్తుల్ని చూచుకొని తెల్లబోయాడు.

"అలాగా! నేను మీరు కుమారస్వామిలా నెమలిపైన ఎక్కివచ్చారేమో ననుకున్నాను" అన్నాడు డాక్టరు.

"మీహాస్యానికిది సమయం కాదు డాక్టరుగారూ! మీరు నాకోసం ఇప్పుడీ నెమలి కడుపు ఆపరేషన్ చేయాలి"

"అయ్యయ్యో, నే నెప్పుడూ పక్షులపైన ఆపరేషన్ జరపలేదే" అన్నాడు డాక్టరు.

"అదేమిటండీ! మా నవ శరీరం పైనే ఎక్కడంటే అక్కడ ఆపరేషన్ జరుపగలమీకు ఈ పాడు నెమలి ఒక లెక్కా డాక్టరుగారూ" అని బ్రతిమాలుకున్నాడు శంకరనారాయణ.

"ఊఁహు. అది నాపనికాదు."

"డాక్టరు చలంగారూ! మీరీ సహాయం చేయకపోతే నా బ్రతుకు అడవిలో తెల్లారిపోతుంది. డి. యస్. పి. గారు ప్రాణంతో సమానంగా చూచుకోమన్న పుత్తరం ఇప్పుడు దీని గర్భాశయంలోవుంది. ఆపుత్తరాన్ని నేను అయిదుగంటలకల్లా ఆఫీసులో చేర్చకపోతే, మళ్లీ అటువైపు పోవలసిన అవసరం వుండదు. డాక్టరుగారూ! ఫీజు ఎంతయినా సరే సమర్పించుకుంటాను"

డాక్టరు చలం కొంతసేపు తీవ్రంగా ఆలోచించి "ఐనాయింత మాత్రం పనికి ఆపరేషన్ ఎందుకయ్యా! ఏదైనా 'ఎమిటిక్'ను ప్రయోగించకూడదూ!" అన్నాడు.

"అవునవును. ఆసంగతే మరచిపోయాను. అలాటి దేదైనా చేసి చూడండి డాక్టరుగారూ!"

ఆతరువాత డాక్టరుగారి గదిలో చెప్పకోతగ్గ హంగామా జరిగింది. శంకరనారాయణ నెమలి కాళ్లను రెంటినీ బంధించి గట్టిగా పట్టుకోగా డాక్టరుగారు బలవంతంగా దానిచేత ఒక మందును త్రాగించారు. ఆమందు నెమలి గర్భకోశంలో పెద్దకల్లోలాన్నే రేపివుండాలి! లేకుంటే అదెందుకు నిప్పుత్రొక్కిన కోతిలా పైకెగిరెగిరి క్రిందపడుతూ మందు సీసాలనూ, ఇంకిబాటిల్‌నీ క్రిందికి తోసేస్తుంది?

అరగంటసేపు అలా వీరవిహారం చేసినపిమ్మట ఆనెమలిఎందుచేతనో కదలడానికి సైతం శక్తిలేనట్టు కుప్పకూరగా నేలపైన కూలబడింది.

అప్పటినుంచీ అది డోక్కోవడం ప్రారంభించింది. కొంత జీర్ణమై, కొంత జీర్ణంకాని ఆహార పదార్థంతో ఆగది నేల ఖరాబై పోయింది. వీధుల్లో వెళ్తున్నవారు సైతం 'అబ్బే, ఏమిటిది' అని ముక్కులు మూసుకుని సాగిపోసాగారు!

ఎలాగైతేనేం, డి. యస్. పి గారి అమూల్యమైన పుత్తరం కూడా డాక్టరుగారి అద్భుత చికిత్సా ప్రక్రియద్వారా బయటికి వచ్చింది.

శంకరనారాయణ ఆపుత్తరాన్ని చేతికి తీసుకుని "డాక్టరుగారూ! ఈపాటికి డి. యస్. పి. గారు నాకోసం ఆఫీసులో వేచి ఉంటారు. మళ్లీ మిమ్మల్ని కలుసుకుంటాను. సెలవు" అని తలుపు తెరచి అడుగు ముందుకు వేశాడు.

"ఇదిగో చూడండి శంకరనారాయణగారూ! మీరు నన్ను కలుసుకున్నా, కలుసుకోకపోయినా అందుకు నాకు చింత లేదు. కానీ ఆమీ పక్షిస్నేహితుణ్ణి మాత్రం ఇక్కడ వదిలిపెట్టి పోవడానికి వీల్లేదు."

"నేను దాన్ని మాఆఫీసుకు తీసుకపోలేనుకదండీ మరి!"

"మీరు దాన్నేం చేసుకుంటారో నాకు తెలియదు. కానీ అదిక్కడ మాత్రం ఉండకూడదు."

శంకరనారాయణ ఇస్సురని నిట్టూర్పు నిగుడిస్తూ చలనం లేక పడిఉన్న నెమలిని తీసుకుని బయటికివచ్చి టాక్సీలో కూలబడ్డాడు. డ్రయివరు ఆనెమలి దుస్థితికి జాలి పడుతూ "ఇప్పుడు మరెక్కడికి వెళ్లమంటారు సార్" అని అడిగాడు. "మనం ఎక్కడ బయల్దేరామో అక్కడికే వెళ్ళనీ" అన్నాడు శంకరనారాయణ. కాంపౌండు గోడకు ఈవల నిలబడి నెమలిని జూలోకి విసిరివేస్తే

అంతటితో పీడ వదిలి పోగలదని అతడు ఒకటి రెండు నిమిషాల వ్యవధిలో ఒక చక్కటి పథకం నిర్ణయించుకున్నాడు.

ఎంతో జాగ్రత్తగా నిర్ణయించుకోబడ్డ పథకాలు సైతం ఈ లోకంలో తారుమారై పోతుంటాయి. శంకరనారాయణ పథకానికి కూడా అలాటి గురవస్థ పట్టింది. ఊరు దగ్గర టాక్సీ ఆగగానే క్రిందికి దిగిన అతడికి నెమలిని దొంగలించిన వాడికోసం ఊరంతా గాలించివేస్తున్న పోలీసులిద్దరు ఎదురై స్వాగతమిచ్చారు!

శంకరనారాయణకు ఆ పోలీసులిద్దరూ అపరిచితులు. పట్టణంలో పది పన్నెండు పోలీసు స్టేషనులున్నాయి. ఈ పోలీసులందులో దేనికి సంబంధించిన వాళ్ళో శంకరనారాయణకు తెలియదు. కానీ అతడు తను సబ్ ఇన్స్పెక్టరనని, వాళ్ళతో పరిచయం చేసుకోబోయాడు. వాడిన ముఖంతో, చెదరిన క్రాపింగుతో, చిరిగిన బట్టలతో బికారిలా తయారైఉన్న శంకరనారాయణ తను సబ్ ఇన్స్పెక్టరునని చెప్పుకున్నందుకు మాత్రమే పోలీసులు విరగబడినవ్వి "తమరు సబ్ ఇన్స్పెక్టరు మాత్రమే ఏమిటండీ! సాక్షాత్తు ఇన్స్పెక్టరు జనరల్ గారి మేనత్తకొడుకులా ఉన్నారు! అదంతా వేరే విషయం. తమరు ముందుగా వచ్చి ఆ పోలీసుస్టేషను వరకూ వచ్చి మా ఆతిథ్యాన్ని కాస్తా స్వీకరించండి" అన్నారు.

* * *

డి. యస్. పి. గారు క్యాంపు నుంచీ తిరిగి రాగానే శంకరనారాయణకోసం కబురు పంపించారు. అతడికోసం వెళ్ళినవాళ్లు తిరిగిరాకముందే గణగణ మని ఫోన్ మ్రోగింది. మళ్లీ ఎక్కడ ఏ అవాంతరం జరిగిందోనని ఆయన రిసీవర్ను చేతికి తీసుకుని "హాలో ఎవరూ?" అన్నారు.

"నేనేనండి, శంకరనారాయణను!" అని బదులు వచ్చింది.

"అరరే నువ్వా! ఎక్కడున్నావయ్యా నేనిక్కడ నీకోసం ఎదురుతెన్నులు చూస్తుంటేనూ!"

"క్షమించండిసార్! ఒక చిన్న పొరబాటు జరిగింది అందువల్ల.."

"అందువల్ల ?"

"ఇప్పుడు గాంధీరోడ్డు పోలీసు స్టేషనులో వున్నాను."

"ఉంటావు, ఉంటావు! నీకేమయ్యా, నువ్వెక్కడయినా వుంటావు. నిజానికి ఇప్పుడిప్పుడే అక్కడనుంచి వచ్చే ఉద్దేశం లేదన్నమాట!"

"ఎలా రానండీ! ఇప్పుడు నేనున్నది పోలీసుల కాపుదారిలో"

"ఏమిటీ! ఎందుకూ?"

"ఒక చిన్న.."

"సరేసరే! ఆ చిన్న పొరబాటేదో తీరిగ్గా ఏడుద్దువుగానిలే" అని డి. యస్ పి గారు రిసీవరు క్రిందపెట్టి, తక్షణం శంకరనారాయణని విడుదల చేయవలసిందిగా గాంధీరోడ్డు పోలీసు స్టేషనుకు కబురు పంపించారు.

ఆ కబురు వెళ్ళిన అరగంటసేపటికి శంకరనారాయణ డి. యస్ పి. గారి ముందర హాజరుగా వించబడ్డాడు!

శంకరనారాయణ చెప్పుకోసుకున్న సోదనంతా సావధానంగా విని నవ్వడానికి మనస్కరించక, ఏడవడానికి మనసురాక ఆఖరుకు మౌనం వహించి అతడి చేతినుంచి తన వెలలేని వుత్తరాన్ని తీసుకుని డి. యస్. పి గారు మెల్లగా కవరు చింపారు.

కవరులోనుంచీ ఒక చిన్న కరపత్రంలాటిది జారి క్రింద పడింది.

"ఇదేమిటి! ఇంత జేసీ ఇదేదో గ్రీటింగు కార్డయ్యా బాబూ! దీనిపైన ఏదో అక్షరాలున్నట్టున్నాయి చూడు" అంటూ డి. యస్ పి. గారు ఆతొందరలో కళ్ళజోడు కనబడక పోవడంచేత ఆ కాగితాన్ని శంకరనారాయణ చేతి కిచ్చారు.

"రాజ (శ్రీ) మామయ్యగారికి రాముం పంపుకున్న ఉగాది అభినందనలు" అని చదివాడు శంకరనారాయణ ఇంచుమించు ఏడుపుముఖం పెట్టి!

"అరరే అదా సంగతి! కవరుపైన మకరాసు అన్న ముద్రకనబడగానే నేను ఇది ఐ జి ఆఫీసునుంచి వచ్చి ఉంటుందని పొఅబడ్డాను. ఇంతకూ యిది మా రాముంగాడు నాకుపంపిన ఉగాది అభినందనలన్నమాట! అయ్యో పాపం! అనవసరంగా చాలా శ్రమపడ్డావు శంకరనారాయణా! ఐయామ్ రియల్లీ సారీ!" అన్నారు డి. యస్ పి. గారు.

వెనుక ఆనుకోవడానికి గోడ ఉండడంవల్ల శంకర నారాయణ గుభేలున క్రిందపడిపోకుండా నిలువరించుకో గలిగాడు!



# జూదరి

చార్లెస్ డికెన్స్ అనువాదం కె. రామచంద్రరావు

నెల్, ఆమె తాత ఎంతో హాయిగా జీవిస్తూఉంటారు. తాతకి ఎక్కువ ధనం సంపాదించాలని బుద్ధి పుట్టి, పేకాటకి దిగుతాడు అప్పుల పాలవుతాడు. బాకీ పెట్టిన క్విల్ప అనేవాడు వాళ్ళ ఇల్లు, దుకాణం స్వాధీనం చేసుకుంటాడు. నెల్, తాత ఎవరితో చెప్పకుండా లండన్ విడిచి పెడతారు. త్రోవలో ఒక మైనపుబొమ్మల ప్రదర్శనం యజమానురాలు, జార్లీ, ఇద్దరికి తనదగ్గిర ఉద్యోగం ఇస్తుంది. నెల్ మంచి పేరు సంపాదిస్తుంది. డబ్బు సంపాదిస్తుంది. ఇలాసుఖంగా ఉంటూఉండగా, తాతకిమళ్ళీ పేకాట అలవాటు పట్టుకుంటుంది నెల్ సంపాదించిన డబ్బంతా తగలేస్తాడు. తాత జార్లీవద్ద డబ్బును దొంగిలించటానికి సిద్ధపడతాడు. మామూలుగా తనతో పేకాడేవారితో ఈ విషయం మాట్లాడుతుండగా అదృష్టవశాత్తు నెల్ వింటుంది. ఆ రాత్రికి రాత్రే తాతని అక్కడ ఉండనివ్వకుండా రహస్యంగా బయలుదేర దీస్తుంది. పోయి, పోయి వారిద్దరూ ఒక పారిశ్రామిక పట్టణం చేరుకుంటారు. అక్కడ తిండి లేక బడలికతో అగచాట్లుపడుతూ ఉండగా, ఇదివరకు వారికి ఆతిథ్యమిచ్చిన ఉపాధ్యాయుడు కనిపిస్తాడు. ఉపాధ్యాయుడు వారిని తనతో తీసుకవెళ్తాడు. ఆ గ్రామంలో తాతకి ఉద్యోగం వస్తుంది. సుఖంగా ఉంటూంటారు.

## 5

ఇంతకాలం లండన్‌లో తాత స్నేహితులు, క్విల్ప ఏమనుకుంటారో, ఏం చేస్తున్నారో చూద్దాం.

వారు పారిపోయిననాడు ఉదయం క్విల్ప కొంచెంఆలస్యంగా లేచాడు. లేచి చూస్తే ఇద్దరూ కనిపించలేదు. క్విల్ప గబగబ తనమిత్రుడు బ్రాస్ వద్దకు వెళ్ళి, అతనిని లేపి జరిగినసంగతి చెప్పాడు. ఇద్దరూ చాలాసేపు తర్కించుకున్నారు. ఇంతలో క్విల్ప కి బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. తప్పకుండా వారిద్దరూకిట్ ఇంట్లోనే ఉంటారని అతడు తలచాడు. వెంటనే అక్కడికి వెళ్ళాడు.

క్విల్ప రాకనుచూచి కిట్, అతనితల్లి ఆశ్చర్య పోయినారు. "నెల్, తాత ఇక్కడ ఉన్నారా?" అని క్విల్పఅడగటంతో వారి ఆశ్చర్యానికి అంతులేకపోయింది. కిట్ చెప్పాడు:

"వారిక్కడ లేరు. తాతగారితో వచ్చిఇక్కడ ఉండమని నేను నెల్‌తో బతిమాలి చెప్పాను. కాని ఆమె అందుకు అంగీకరించలేదు. వాళ్లు ఎక్కడకి వెళ్లారోగదా!"

"అయితే నీకు ఏం తెలియదన్న మాట!" క్విల్పగద్దించి అడిగాడు.

"తెలియదు." క్విల్పకి నమ్మకం కుదర లేదు. కిట్ కి కోపంవచ్చింది.

"నేను అబద్ధం చెపున్నానని మీరనుకుంటున్నారు కాబోలు. అబద్ధం చెప్పవలసినగతి నాకేం పట్ట లేదు."

క్విల్ప తక్షణం ధోరణి మార్చాడు. "అబ్బే! నీమాటనాకు నమ్మకం లేకకాదోయి! నేనువాళ్ళ ఆస్తి స్వాధీనంచేసుకున్నాను కదూ! బాకీవసూలుకి అలాచేసినా, పాపం ఆముసలివాడిమీద నాకు చాలా జాలివేసింది. చెప్పవద్దూ! ఏదన్నా సహాయంచేద్దామని అనుకున్నాను. చెప్పకుండా వెళ్ళిపోయినాడు. వారివిషయం ఎవరైనా ఆచూకీతీయగలిగితేబహుమతిఇద్దాంఅనిఉన్నది"

ముసలివానిపై ఒక్కసారిగా క్విల్పకి కలిగిన ఆదరానికి కిట్ విస్మయం పొందినా, సంతోషించాడు. క్విల్పకు ఉన్న నిజమైన ఉద్దేశ్యం అదికానేకాదు. తాత తనడబ్బు కొంత ఎక్కడో రహస్యంగా దాచాడని అతని అనుమానం. ఎలాగైనా తాతనిపట్టుకొని బ్రాస్‌సహాయంతో ఆడబ్బు కాజేయాలని లోపల అతనికోరిక. అందుచేత అతడుతాతకోసం నెల్ కోసం అన్వేషణ ఆరంభించాడు. అలా అన్వేషిస్తూఉండగానే ఒకసారి నెల్‌కి కనిపించాడు కూడా!

కిట్‌కూడా నెల్, తాత ఆచూకీ కోసం ప్రయత్నిస్తున్నాడు. అతనికి వారిపైగల ప్రేమాభిమానాలు ఇంతంతకాదు. వారికోసం లండన్ నగరంలోని ప్రతి మారుమూల భాగం వెతికాడు. కానివెళ్ళినచోటల్లా వివిధ రకాలైన వదంతులు వినిపించినాయి. చాలా ఆందోళన చెందాడు.

అతనికి మరొకవిచారం కూడా

తీర్పడింది. ప్రస్తుతం అతనికి ఎక్కడా పనికుదరలేదు. తల్లిని, ఇద్దరుచిన్న తమ్ముళ్ళను పోషించవలసిన బాధ్యత అతనిమీదనున్నది. ప్రతి రోజు ఉదయం పనివెతుక్కుంటూ పోయేవాడు. సాయంత్రానికి కాళ్ళీడ్చుకుంటూ వచ్చేవాడు. రోజులు కష్టంగా గడుస్తున్నాయి.

ఒకరోజున అతడు వీధిలో పోతూఉండగా ఒకపెద్ద మనుష్యుడు గుఱ్ఱపు బగ్గీలో వచ్చి ఒకభవంతి ముందు ఆగాడు. ఆయన కిట్‌ని పిలిచి తాను లోపలికి వెళ్ళి వచ్చేవరకు బగ్గీ చూస్తూ ఉండమని చెప్పాడు. ఆపని చేసినందుకు ఆయన తిరిగి రాగానే ఒక షిల్లింగ్ నాణెం చేతిలో పెట్టి అందులో ఆరుపెన్నీలు తీసుకొని మిగిలిన చిల్లర ఇమ్మన్నాడు. కాని కిట్ దగ్గిర చిల్లర లేకపోయింది. అప్పుడు ఆ పెద్దమనుష్యుడు ఇలా అన్నాడు.

"సరే! ఆ షిల్లింగు తీసుకో. వచ్చేవారం సరిగా ఇదే వేళకి నువ్వు ఇక్కడికిరా! ఈనాటికి మల్లేనే బగ్గీ చూద్దువుగాని. ఇవ్వాలిసిన ఆరు పెన్నీలు చెల్లిపోతాయి."

కిట్ సమ్మతించాడు. మరునటి వారం సరిగా అదే రోజున అదే వేళకి కిట్ అక్కడికి వెళ్ళి బగ్గీవద్ద కనిపెట్టుకుని ఉన్నాడు. కిట్ నిజాయితీకి ఆ పెద్ద మనుష్యుడు సంతోషించి తనదగ్గిర పనిలోకి తీసుకున్నాడు ఆనాటినుంచి కిట్‌కి కుటుంబపోషణ సమస్య తీరిపోయింది. ఇక మిగిలిన చింత అంతా వృద్ధయజమానిని గురించే.

ఇలా ఉండగా ఒకనాడు ఎవరో ఒక పరదేశి లండన్ వచ్చాడు. అతడు ఉష్ణదేశాలలో తిరిగివచ్చిన వానివలె నల్లబడ్డాడు లండన్ నగరంలోని ప్రతి మారుమూలభాగం అతనికి బాగా తెలుసు. లండన్ వస్తూనే అతడు నెల్ తాత పెట్టిన పాతవస్తువుల దుకాణం వద్దకి పోయినాడు ఆదుకాణం తలుపుమూసి ఉండటం చూసి చాలా నిరాశచెందాడు ఆఇంటిముందు "అద్దెకు ఇవ్వబడును" అని ఉన్న బోర్డు చూశాడు. ఆవిషయం వివరాలు కావాలంటే బ్రాస్ వద్దకి వెళ్లాలని కూడా ఆ బోర్డుమీద వ్రాసి ఉన్నది. వెంటనే ఆగంతుకుడు బ్రాస్‌వద్దకి వెళ్లాడు ఆ ఇంట్లో ఒక గది అద్దెకు తీసుకొని నెల్,గురించి తాతగురించి దర్యాప్తు చెయ్యసాగాడు. అయితే అతడు బ్రాస్‌ను ఏమీ ప్రశ్నించలేదు. అతడు శుద్ధ మూర్ఖుడని, నమ్మదగినవ్యక్తి కాదని ఆగంతుకుడు తెలుసుకున్నాడు.

కొన్నిరోజులు గడిచాయి. క్రమంగా ఒకొక్క విషయమే ఆయన తెలుసుకోసాగాడు నెల్ జార్లీ మైనపు వస్తుప్రదర్శనశాలలో పనిచేస్తుండగా చూసినవాడొకడు ఆయనకి ఆవిషయం తెలిపాడు ఆయన ఆవిషయం చెప్పినవానికి మంచి బహుమతులిచ్చాడు. ఆపట్టణం వెళ్లి వెంటనే నెల్‌ని తాతని కలుసుకోవటానికి సిద్ధపడ్డాడు. కాని ఆయనకి ఒక అనుమానం వచ్చింది. తాత తనని గుర్తించగలడో లేదో అని! గుర్తించకపోగా తానేదో కీడు చేయటానికి వచ్చినట్లు భావిస్తాడేమో! అందుచేత ఎవరైనా తెలిసినవారిని వెంట తీసుకుని పోవాలని నిశ్చయించాడు.

కిట్ ఒక్కడే వారికి సన్నిహితుడు, శ్రేయాభిలాషి అని ఆగంతుకుడు తెలుసుకున్నాడు. వెంటనే అతని చిరునామా సంపాదించి అక్కడికి వెళ్లాడు. కిట్ ఇంటివద్ద లేడు. కొత్తగా సంపాదించుకున్న ఉద్యోగంలో చేరటానికి యజమాని అయిన ఏబెల్ యింటికి వెళ్లాడు ఆయన ఒక్క నిమిషం ఆలస్యం చెయ్యకుండా అక్కడినుంచి ఏబెల్ వద్దకి వెళ్లాడు.

ఏబెల్ సద్గుణుడు, సహృదయుడు. ఆగంతుకుడు చెప్పినదంతా విని, అతనికి సహాయం చెయ్యటానికి అంగీకరించాడు కిట్‌నిపిలిచి ఆయన వెంట వెళ్లమని చెప్పాడు.

కిట్ అంతావిని విచారంగా ఇలా చెప్పాడు. "అయ్యా! నేను మీ వెంట రావటానికి వీలుండదు. ఎందుచేతనో నాయజమాని నామీద ఆగ్రహంగా ఉన్నాడు నేను ఆయన కంటపడితే చాలు ఆయనకి పిచ్చి ఎత్తిపోతుందిట! నెల్ చెప్పింది"

ఈసంగతి విని ఆయన కుప్పగా కూలిపోయాడు. "అయ్యా! నా ఆత్మీయులను నేను కలుసుకునేపాటి అదృష్టం ఇక నాకు లేనేలేదా?"

కిట్ కళ్ళవెంట నీరుకార్చాడు.

"నేను రాకపోయినా, మాఅమ్మ వస్తుంది తీసుకొని వెళ్ళండి" అని చెప్పాడు ఆయన సంతోషంతో అంగీకరించాడు. కిట్ తల్లికూడా

ఈసంగతి తెలుసుకొని మహదానందంపొందింది. ఆయనవెంట జార్జీ వద్దకు వెళ్ళింది

మూడురోజులు ప్రయాణంచేసి ఎంతో ఆశతో అక్కడికి పోతే, అక్కడా నిరాశఎదురైంది. జార్జీ కూడా ఏమీ చెప్పలేకపోయింది. "నేను వాళ్ళకి ఎంతో సహాయం చేశాను. ఆదరించాను. నెల్ ఎంత మంచిదని! నాపై ఎంతో గౌరవం కలిగి ఉండేది మరి నాతో చెప్పకుండా ఎందుకు వెళ్ళిపోయిందో తెలియదు. బహుశా ముసలివాడివల్లనే అయి ఉంటుంది. అతనికి మతిస్థిమితం లేదు"

జార్జీవద్ద సెలవు తీసుకొని ఆయన, కిట్ తల్లి ఒక సత్రంలోకి వెళ్ళారు. అక్కడ వాళ్లకి క్విల్ప్ కనిపించాడు. క్విల్ప్ ని చూడగానే ఆయన రుద్రుడైపోయాడు "ఏం? ఇక్కడున్నావెందుకు? ఏంపని నీకు?"

క్విల్ప్ మామూలు ధోరణిలో బదులు చెప్పాడు. "ఆ విషయం మీకెందుకు?"

"ఎందుకా? నువ్వు నెల్ నీ, ముసలివాణ్ణి పెట్టిన బాధలన్నీ విన్నాను. నీసంగతి నాకేమీ తెలియదనుకోకు. ఇంకా ముసలివాడికోసమే నువ్వు వెతుకుతున్నావని నాకు తెలుసు అతని దగ్గర ఇంకా డబ్బుపిండాలని చూస్తూ ఉన్నావనీ తెలుసు. జాగ్రత్త! వెళ్ళిపో! ఇక్కడినుంచి ఇలాంటి వ్యవహారంలో నువ్వు మళ్ళీ కనిపించావా మక్కెలు విరగతంతాను పో! వెంటనే!"

ఆయనకి వచ్చిన కోపంచూసి కిట్ తల్లి వణకిపోయింది. క్విల్ప్ కూడా అక్కడనుంచి పారిపోయినాడు. తరువాత కొంత సేపటికి ఆయన లండన్ పోయే బండిలో కిట్ తల్లిని ఎక్కించి పంపివేశాడు తన పనిపైన మరోదారిన వెళ్ళిపోయినాడు.

ఆబండికే క్విల్ప్ కూడా బయలుదేరివచ్చాడు. ఇప్పుడతడు పొందిన అవమానానికి తగిన ప్రతీకారంచేసే అవకాశం చిక్కింది. ముసలివాడిపైనకిట్, తల్లి ఎందుకు ఇంకాగౌరవంకలిగి ఆరాధిస్తున్నారు? వాడు ఇంకా ఏదోవారికి మేలుచేస్తాడనే కదా! ఆయనవాళ్ళకోసం ఎందుకు వెతుకుతున్నాడు? ఈ ప్రశ్నలు అతన్ని వేధించినాయి.

ఆప్రయాణం అంతటిలోను అవకాశం చిక్కినప్పుడెల్లా క్విల్ప్ ఆమెను హీనంగాచూచాడు. చావగొట్టటానికి సిద్ధమైనాడు. బండి ఎలాగైతేనేం లండన్ చేరింది. కిట్ తల్లికోసం బండిఆగేచోట నిరీక్షిస్తున్నాడు. ఆమె కిట్ దగ్గిరికిపోయి క్విల్ప్ వంకచూపిస్తూ బోరుమని ఏడ్చింది కిట్ ఆశ్చర్యంగా 'ఏమిటి?' అనిఅడిగాడు. కాని ఆమె సమాధానం చెప్పలేకపోయింది. కిట్ క్విల్ప్ మీదికిదూకి చీవాట్లుపెట్టాడు. క్విల్ప్ అతడు చావగొట్టుతాడేమోనన్న భయంకొద్దీ కిక్కురుమనకుండా వెళ్ళిపోయినాడు కిట్,తల్లి ఇంటికి వెళ్లారు.

క్విల్ప్ అక్కడినుంచి సేరుగా తన లాయర్ మిత్రుడు అయిన బ్రాస్ దగ్గిరికి వెళ్లాడు.

"కిట్ ని ఎలాగైనా నానా కష్టాలుపెట్టాలి"

"ఏం? ఎందుకు?" అని అడిగాడు బ్రాస్.

"వాడికి ఏదో ఒక శాస్తిజరగాలి"

"అసలు సంగతిచెప్పు."

"సంగతి ఏమయితేనేం? నేను చెప్పినదిచేయి."

"సరే. ఆ సంగతి నేను చూస్తాలే." అని హామీ ఇచ్చాడు బ్రాస్.

"ఎలా? ఏమి చేస్తావ్" అని అడిగాడు క్విల్ప్.

"ఎలాగో! నేను ఆలోచించి చేస్తానుగా"

"అవును, నీవు తలచుకుంటే ఏమిచెయ్యలేవు! వాణ్ణిముక్కుపట్టి నేలకు రాయాలి" అని ప్రశంసించి క్విల్ప్ వెళ్ళిపోయినాడు బ్రాస్ అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు.

(ఇంకా వుంది)

---

ఆలస్యంగా వచ్చిన గుమాస్తానుచూచి మేనేజరు ప్రశ్నించాడు:

"ఈఉదయము ఇంతఆలస్యముగా ఎందుకువచ్చావ్?"

"నే నెక్కువ సేపు నిద్రపోయానండి,"

"ఏమిటీ! నీ ఇంట్లోగూడా నిద్ర పోతున్నావా?"

ఎం. బి. రాజు.

---

 ## తిరుగుబాటు 

(35-వ పేజీ తరువాయి)

పారబాటైంది! ఎంత పొరబాటైంది!! ఎంత అపచారం! అసలే యిది అతి వాగుడు కాయ! నే నంటూనేవుంటా 'ఒకే ఆడపిల్ల కింత నోరు పనికిరాదురా'ని యేమన్నా విన్నారా? తనవాళ్ళూ, పరాయివాళ్ళని కూడా లేకుండా మరీ యింత విచ్చలవిడీ, నోటి దుడుకూ! . అయినా నాకైనా తట్టిందా?.. నాతోనైనా ఒక్క మాట న్నావు కాదేం అబ్బాయీ?.. ఏమీ అనుకోకు నాయనా.. ఏదో తెలిసీ తెలీని బాలకం...ఇంత రభసాచేసి. వుత్త పిచ్చిపిల్ల, నాదగ్గరికొచ్చి గుక్క నీళ్లు కుక్కుకుంటూంది."

చైతన్య "అబ్బెబ్బే...నే ననుకోడాని కేముం దత్తయ్యగారూ!..ఎన్నన్నా నన్ను కాదుగా? అయినా అనరానిమాట లేమున్నాయి అందులో?" అన్నాడు తెలివిగా.

మురళి "గడుసువాడివిరా మొత్తానికి!... అమ్మోయ్! వీడు నాతోబాటు చదువుకున్న నేస్తమే! - చైతన్యరావు! కాశీలో యిపుడు రిసెర్చి చేస్తున్నాడు. ఊరికి సెలవుల కొస్తూ నాకు తెలుపకుండా దిగి నన్ను బోల్తా కొట్టించాలనుకున్నాడు. గాడల్ను! తానే బాగా బోల్తాబడ్డాడు! నిశ్చల బాగా బుద్ధి చెప్పినట్లుంది..." అని మళ్ళా విరగబడి నవ్వడం మొదలెత్తాడు. నిశ్చల అమ్మచాటునుండి, వెకిలినవ్వు నవ్వుతూ తలగోక్కుంటూన్న చైతన్యను పరీక్షగా చూచింది

నిశ్చల చైతన్యను మొదటిసారిగా చూచినప్పుడే తట్టింది 'ఎక్కడో చూచినట్లుందే'నని కానీ ఆ వుద్రేకంలో జ్ఞాపకానికి వచ్చింది కాదు. రాత్రి అన్నయ్యా ఆయనా భోజనానికి వెళ్ళినపుడు హాలులోకి పోయి అన్నయ్య గ్రూపుఫోటోలో చూచింది. అన్నయ్య, ఆయన ప్రక్క ప్రక్కనే కూర్చునున్నారు మొదటివరుసలో నే క్రింద అచ్చువేసిన పేర్ల పట్టీలో చూచింది చైతన్యరావు ఎమ్ ఎస్సి అనివుంది. "ఈ ఫోటో కొన్నిసార్లు చూచుంటాను. సమయానికి జ్ఞాపకానికొచ్చింది కాదు. అయినా చేసిన ప్లానంతా యిట్లా పట్టాలు తప్పిందే! ఇంతకీ పాపం ఆయనే మనుకున్నాడో మేమిటో! మొదట్నుంచీ అంటూనే వున్నాడు 'పొరబట్టున్నావో' అని. విన లేదు! ఎంతతలతిక్కగా, నిర్లక్ష్యంగా మాట్లాడాను, పరిచయమైనా కాని ఆయన్తో! అందులో పాపం యిల్లు వెదుక్కొనొచ్చిన అతిథి, అన్నయ్య నేస్తంకూడాను!... ఇంత గందరగోళమైనా అన్నయ్య కనబడగానే యెంతమనసిచ్చి నవ్వుకున్నారు! అబ్బ ఎంత సెన్సాఫ్ హ్యూమర్ ఆయనకి!" అనుకుంది.

భోజనాలైన తరవాత మిత్రులిద్దరూ చాలాసేపు యిష్టాగోష్ఠి జరుపుకున్న పిమ్మట మురళి అన్నాడు—"చైతన్యా! నీవిసాయంత్రం నిశ్చల ప్రవర్తనగురించి మరేమీ అనుకోకు! ఆ అమాయకురాల్ని అంతగా రెచ్చగొట్టినవాళ్ళం మేమే! నీ కేమనుకున్నావో యేమోనని చాలా నొచ్చుకుంటూం దళ్లే వుంది"

చైతన్య కీ మాటలేమి చెవి సోకినట్లులేవు "మురళీ! నీ వెప్పుడూ నీ కిలాంటి చెల్లెలుందని యెందుకు చెప్పలేదు?...కన్నుల్లో వత్తులేసుకొని వెదికి వేసారి కడపటికి నిరాశ చేసికొన్నానే — ఆ అదృశ్య ప్రేయసి యిన్నాళ్లకు కనిపించింది! మొక్కవోని వ్యక్తిత్వం, ఆత్మగౌరవం నీతో పంచుకుందోయ్!.. అబ్బా! అయినా తల్చుకుంటే ఒళ్లు జలదరిస్తుంది! ఎటువంటి సిట్యుయేషన్, ఏమి క్లైమాక్స్!! ...మురళీ! నీ చెల్లెలికేం అభ్యంతరం లేకుంటే..." అన్నాడు, మురళి చేతిని తనచేతిలోకి తీసికుంటూ!

మురళి చైతన్య చేతిని నొక్కుతూ మందహాసం చేశాడు!!



# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 205. పిల్లి కళ్ళ సులోచనాలు

చెయ్యడానికి వీలులేదా? అని నెల్లూరు నుంచి వి. శ్రీనివాసశర్మగారట అడుగుతున్నారు. పిల్లి, పులి వంటి జంతువులు రాత్రిపూట చూడగలగడానికి వాటి కంటి నిర్మాణము కారణము కంటికి ముందు పలచని పొర, దాని వెనుక కనుగ్రుడ్డునకుగల రంధ్రము, దానివెనుక భూతి అద్దమువంటి కటకమూ, దానివెనక ద్రవమూ, ఆ వెనుక రెటీనా అన్న తెర, ఉంటాయి ఒక వస్తువుయొక్క ప్రతిబింబము రెటీనామీద పడినప్పుడు అక్కడి నరాలు ఆ బింబపు రూపాన్ని మెదడుకి అందిస్తాయి. కంటిలోని కటకము పలచనా దళసరి అవుతూ, వస్తువుల పూర్తి రూపాలు రెటీనామీద పడడానికి అవకాశము కలిగిస్తుంది.

వయస్సు చెల్లినవారికీ, కంటితో చదువూ, వాచీ రిపేరూ వంటి పనులు జాస్తిగా చేసేవారికీ కంటి కటకము పని చేసి చేసి అలిసి, కుంచించుకోడమూ, సాగడమూ చెయ్యలేక దగ్గరగావున్న వస్తువునీ, దూరపు వస్తువుని రెటినామీద పడేటట్లు చెయ్యలేకపోతుంది ఇలాంటి లోపాల్ని సర్దుబాటు చెయ్యడానికి కంటికి ముందు కటకాలను అమర్చిన సులోచనాలు పెట్టుకుంటారు సులోచనాలు వస్తువుల బింబాల్ని రెటీనామీద పడేటట్లు చేస్తాయి సులోచనాల అద్దములమీదగాని దూరపు వస్తువుయొక్క ప్రతిబింబము పడి, దానిని కన్ను చూస్తూండినట్లయితే, ఆ సులోచనాల అద్దాలకు పిల్లి రెటినామీదఉన్నలాంటి లేపనమును పూసి పిల్లికళ్ళసులోచనాలు నిర్మించలేమా అని అడగవచ్చు కాని సులోచనాల ఉద్దేశము దూరపువస్తువునుంచి వచ్చే వెల్తురిని రెటీనామీదికి సర్దడమాయె. మరి పిల్లికళ్ళసులోచనాలనగా యేమిటీ?

అయితే ఈ వూహా ఒకందుకు పనికి వచ్చింది సూక్ష్మదర్శినిలోనుంచి ఒక నలకను చూచినప్పుడు ఆ నలకను వెలిగించే వెల్తురు ఎరుపునించి నీలిరంగువైపునకు మారుతూన్నకొద్దీ ఆనలక స్ఫుటమౌతూవుంటుంది. పట్టకములోనుంచి ప్రసరించిన వెల్తురు ఏడు రంగులుగా విభిన్నము కావడము మీరు గుర్తించి వుంటారు వెల్లనికిరణాలను ఈరీతిగా విశ్లేషించినప్పుడు నీలమునకు దాటి అవతల వెల్తురు పడుతూనేవున్నదనీ, అది రెటినాకు అందదనీ రిట్టర్ అన్న వైజ్ఞానికుడు కనిపెట్టి చెప్పినాడు. సూక్ష్మదర్శినితో చూడవలసిన అల్పకణములమీద నీలిరంగునుకాక ఈ అతినీలలోహిత (*Ultra-violet*) కిరణాలనుప్రసరించి, ఆకణముల ప్రతిబింబమును యశద గంధకిదము పూసిన తెరమీద పట్టినట్లయితే, ఆ తెర మెరిసి ఆ బింబాన్ని చూపిస్తుంది. కణమును వెలిగించినవి నీలపురంగుకంటె సూక్ష్మములైన అతినీలలోహితకిరణాలు కనక బింబము స్ఫుటముగా వుంటుంది. ఈ సూక్ష్మదర్శిని పిల్లికళ్ళసులోచన మేకదా?

## చెఱువుమీద మంచు గడ్డ కట్టినా చేపలు చావవేమి?

అని నూర్యాపేటనుంచి ఘంటా రాఘవరెడ్డిగారట అడుగుతున్నారు. ఇంగ్లండు, స్వీడను, నార్వే, కెనడావంటి దేశములలో చలికాలములో ఆరుబయట నీరు గడ్డకట్టేస్తుంది. చెరువులలో నీరు గడ్డకట్టడములో పైనించి అడుగుకి గడ్డకట్టుతుంది. అందువల్ల ఈ మంచుగడ్డ పొరక్రింద నీరు మిగిలి వుంటుంది. ఆ నీటిలో చేపలు సురక్షితముగా ఉంటాయి

ఏ వస్తువునైనా వెచ్చబెట్టినట్లైతే అది వ్యాకోచము పొంది పరిమాణములో ఎక్కువౌతుందని మీకు తెలుసును. మంచుగడ్డను వెచ్చబెట్టినట్లైతే 4 డిగ్రీలు ఉష్ణతకు చేరేవరకూ ఆ మంచుగడ్డనుంచి ఏర్పడే నీరు కుంచించుకుని, తర్వాత అయిదూ, ఆరూ, డిగ్రీలు దాటుతూన్నప్పుడు పెరుగుతుంది. (అల్యూమినమును వెచ్చబెట్టితే పెరుగుతూనే కరుగుతుంది అలాగే సీసమూ, తగరమూ, ఇత్యాది.) కాని మంచుగడ్డ మాత్రము నీరై, వెచ్చబడుతూ 4 డిగ్రీల దాకా కుంచించుకుని ఆ తర్వాత పెరుగుతుంది. అంటే ఏమన్నమాటా? కొంత బరువుగల మంచుగడ్డను తీసుకుంటే, 4 డిగ్రీల ఉష్ణతకడ దానిలోని వస్తువుయొక్క దట్టతనము అనగా సాంద్రత ఎక్కువన్నమాట. కాదా మరి? బరువు అలాగే వుండి పరిమాణము 4 డిగ్రీలకడ తక్కువాయె. అంటే నీటి సాంద్రత 4 డిగ్రీలకడ హెచ్చు అన్న మాట కదా?

ఇప్పుడు 4 డిగ్రీల ఉష్ణతకల నీటిని కొంత తీసుకుని వెచ్చబెట్టినా మనుకోండి. నీరు పెరుగుతూ, సాంద్రత తగ్గుతుంది వెచ్చబడిన నీరు తేలికై మీదికి తేలిపోతుంది. అలాగే 4 డిగ్రీల ఉష్ణతకల నీటిని చల్లబరుస్తూపోతే 3, 2, 1 డిగ్రీలకు దిగినప్పుడు అది పెరుగుతూనేపోయి మంచుగడ్డ అయినప్పుడూ పెరుగుతుంది (కనకనే మంచుగడ్డ నీటిలో తేలుతుంది)

ఇప్పుడు చెఱువులోని నీరు శీతగాలులకు చల్లబడిందనుకోండి. 4 డిగ్రీలవరకూ నీరు కుంచించుకుని సాంద్రత హెచ్చుకావడము వల్ల అడుక్కి దిగిపోతుంది ఇలాగ చెరువులో నీరంతా 4 డిగ్రీలకి చల్లబడుతుంది. ఇకపైన చల్లబడితే ఆనీరు (కుంచించుకోక) పెరుగుతుంది అంటే సరికిసరి తీసుకుంటే బరువుతగ్గుతుంది, పైకి తేలిపోతుంది. ఇంకా చల్లబరిచినా అంతే; చెరువునీటిపై పొరలు చల్లబడి మంచుగడ్డ అవుతుంది క్రిందినీరు 4 డిగ్రీలదగ్గరనే వుంటుంది. ఇంకా అతిశీతువల్ల చల్లబడితే ఆనీరూ పైకితేలి గడ్డకడుతుంది. మంచుగడ్డ లోహములవలె ఉష్ణమును తనలోనుంచి ప్రసరించనియ్యదు. కనక దిగువనీటికి పైనవున్న మంచు, శీతువు సోకకుండా రక్ష.

ధృవప్రాంతాలలో చెరువుల నీటి ఉపరిభాగము గడ్డకట్టియుండటంవల్ల నీరు దొరక్క, గొడ్డళ్ళతో మంచుగడ్డను తవ్వి అడుగునవున్న నీరు చేదుకుంటారు ఎస్కిమోలు ఇంగ్లండులో చెరువుమీదినీరు - మన దేశంలో నెయ్యి తెట్టెగట్టినట్టె - మంచుగట్టేసినా, ఆ పొర దళసరి చాలకపోతే పోలీసులు చెరువుకి కాపలావుండి, పిల్లలు ఆ మంచుగడ్డమీద జారుడుఆటలుఆడకుండా చూస్తారు. 'ఎప్పుడైతే ఈ పొర బాగా దళసరెక్కిందో అప్పుడు మనము నడిచినా విరగదు. క్రింద నీరూ చేపలూ అలాగే ఉంటాయి! ★

---

# బొంబాయి సినిమా లేఖ

విదేశీయ చిత్రాలను, దిగుమతి చేయబడిన చిత్రాలను బొంబాయిలో మాత్రమే సెన్సార్ చేయించడానికి డా॥ కేస్కార్ చేసిననిర్ణయానికి అసమ్మతి సూచకంగా, కలకత్తా ఫిలిం సెన్సార్లు మూకుమ్మడిగా రాజీనామా యిచ్చారన్న వార్త బొంబాయి ఫిలింరంగంలో పెద్ద సంచలనం కలిగించింది. డా॥ కేస్కార్ నిర్ణయాన్ని చూస్తే, ఆయనకు బెంగాలీ, మద్రాస్ సెన్సార్లమీద నమ్మకం లేదనే చెప్పవచ్చునని పలువురు భావిస్తున్నారు. డా॥ కేస్కార్కు రాష్ట్రీయాభిమానం బాగావుందని కూడా రాజకీయ వర్గాల వారు భావిస్తున్నారు. నిజానికి ఫిలిము, సంగీతం, నాట్యంపై ఆధ్వర్యం వహించే డా॥ కేస్కార్ను విమర్శించినంతగా ఎవరూ మరే మంత్రిని విమర్శించడంలేదు. ఆయనను బాగా విమర్శించేవారు కళాకారులే. ఫిలిం నిర్మాతలు, ఫిలిం కళాకారులు, శాస్త్రీయ గాయకులు, నాట్యకారులు, భారతీయ కళావేత్తలు అందరూ ఆయన విధానాలను, చర్యలను విమర్శించారు.



లతామంగేష్కర్ నిర్మిస్తున్న "భైరవి" చిత్రంలో నళినీజయవంత్.

* * *

మరికొన్ని నెలల్లో మూడు విదేశీయ చిత్రాలు భారతదేశంలో షూట్ చేయబడనున్నాయి. ఇవి ఎమ్. జి. ఎమ్ వారి "బుద్ధ జీవితము", రాబర్ట్ ఆంద్రూ తీయనున్న "అలెగ్జాండర్ ది గ్రేట్", ఆర్కోస్ రతోన్స్కీ తీయనున్న "తృతీయ నేత్రం" (థర్డ్ ఐ). వీటన్నిటిలోనూ ముఖ్యపాత్రధారులు విదేశీయులే. చిన్నరపాత్రలు ధరించేవారు, టెక్నీషియన్లు మాత్రం భారతీయులు. ఈ మూటిలో ఆఖరుదాన్ని ఫిలిమ్స్థాన్ వారు నిర్మిస్తారు. భారతదేశంలో తయారైన చిత్రానికి అమెరికన్ మార్కెట్ను సంపాదించడానికి వేసిన ఎత్తుగడ యిది.

ఇప్పటివరకూ అమెరికాలోకి మన చిత్రాలు సులభంగా అడుగుపెట్టడానికి వీలు లేకుండా వున్నది. అమెరికన్ టెక్నీషియన్ల సహాయంతో, టెక్నికలర్లో తీసిన "ఝాన్సీకీ రాణీ" చిత్రానికికూడా అమెరికాలో ప్రదర్శనభాగ్యం లభించలేదు. ఈ కారణంచేత అమెరికన్ చిత్రాలపై భారత ఫిలింరంగంలో వ్యతిరేకభావం ప్రబలుతోంది. హిందీ చిత్రాలన్నీ కలిసి సంపాదించేంతధనం అమెరికన్ చిత్రాలు కూడా మనదేశంలో సంపాదిస్తున్నాయని అంచనా వేయబడింది. అమెరికన్ చిత్రాలను రానివ్వకూడదని కూడా కొందరు పెద్ద ఫిలిం వ్యాపారస్థులు ప్రతిపాదిస్తున్నారు.

* * *

ఎమ్. ఎండ్ టి స్టూడియోస్ అధినేత కె. పి. తివారి "లాఖోం మే ఏక్" అనే క్రొత్తరకంహాస్యచిత్రం పూర్తిచేశారు. ఒకే ఆత్మయొక్క మూడు జీవితాలను — (ఒకటి భూలోకంలో, ఒకటి నరకంలో, ఒకటి స్వర్గంలో) చిత్రించే కథగల చిత్రం ఇది. ఆమూడు పాత్రలను రాజ్ కుమార్, జైరాజ్, డేవిడ్ ధరించారు. ఆ మూడు జన్మలలోనూ ముగ్గురికీ ప్రేయసిగా అతా మధుర్ నటించింది. కాముకురాలైన నటిగా స్మృతిబిశ్వాస్ మరొకపాత్ర ధరించింది. సంగీత దర్శకుడు [illegible]; దర్శకుడు హీరాసింగ్.

* * *

దేవ్ ఆనంద్, అతని భార్య కల్పనా కార్తిక్ మహాబలేశ్వర్ వెళ్లారు. చల్లని ఆపర్వత ప్రాంతంలో వారు విశ్రాంతి తీసుకోవడమేగాక తాము క్రొత్తగా తీస్తున్న "హౌస్ నం. 44" అనే చిత్రం తాలూకు లొకేషన్ దృశ్యాలుకూడా తీస్తారు. వీరిద్దరు కలిసి నటించిన చిత్రం "టాక్సీ డ్రయివర్." ఆచిత్రంలో పనిచేస్తుండగానే వారు పెళ్లాడారు.

* * *



బిమల్‌రాయ్ నిర్మిస్తున్న "అమానత్" చిత్రంలో చాంద్ ఉస్మానీ.



గోకుల్ పిక్చర్స్‌వారి "వదినగారి గాజులు"లో ఛాయాదేవి, కుటుంబరావు.

చంద్రగా చిన్నపాత్రను ధరించడానికి వైజయంతీమాల ఒప్పుకోవడం చూసి పలువురు ఆశ్చర్యపడుతున్నారు.

* * *

ఈమధ్య మూడు ముఖ్యమైన చిత్రాలు ఆజాద్, జవాన్, దోదుల్హే — బొంబాయిలో విడుదల అయ్యాయి. మామూలు చిత్రాలు బిల్వమంగళ్, లగన్, డాకూ, చిరాగ్-ఇ-చీన్, అలీబాబా కా బేటా కూడా విడుదల అయ్యాయి. పై మూడు చిత్రాలలో దక్షిణభారత నిర్మాతల వ్యక్తిత్వం బాగా ప్రస్ఫుటమైనది.

"ఆజాద్" బొంబాయిని కదల్చి వేసింది. ఈ ఏడాది చిత్రాల్లోకల్లా పెద్ద బాక్సాఫీస్ చిత్రం ఇదే. దీనితో శ్రీరాములు నాయుడు గారు హిందీచిత్ర రంగంలో సుప్రతిష్ఠితులయ్యారు. సాయి, సుబ్బులక్ష్మి చేసిన నృత్యాలు ప్రజలలో వేలం వెర్రి కలిగించాయి. హీరోగా నటించిన దిలీప్ కుమార్ తన బహుముఖప్రజ్ఞను ఈచిత్రంలో చూపించాడు.

"జవాన్" చిత్రం దెబ్బతిన్నది. వైజయంతీమాల సమర్థులైన దర్శకులు, నాట్య దర్శకుల సహాయం లేకుండా బాగా నటించలేదు, నాట్యం చెయ్యలేదు అని యీచిత్రం ఋజువు చేసింది.

జెమినీవారు తీసిన "దోదుల్హే" ఒక మోస్తరుగా నడుస్తోంది. కథ అతుకుల బొంతవలె వున్నది. హీరోగా సజ్జన్ అంత ఆకర్షించే మనిషిగా లేడు. ఆగా హాస్యం, వనజ నాట్యాలు, కొన్ని మంచి హాస్యంగల సన్నివేశాలు చిత్రంలోకల్లా మెచ్చుకో దగ్గవై వున్నాయి. ★

## ఫెడరేషన్ అధ్యక్షులుగా వాసన్‌గారి ఎన్నిక

భారత ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షులుగా ఎస్. ఎస్. వాసన్ గారు మళ్ళీ ఎన్నుకోబడ్డారు. మార్చి 30 వ తేదీన బొంబాయిలో జరిగిన వార్షికసభలో ఈఎన్నిక జరిగింది. బి. యన్. సర్కార్, ఎమ్. బి. బిలిమోరియా ఉపాధ్యక్షులుగాను, ఎ. వి. మెయ్యప్పన్ కోశాధికారిగాను ఎన్నుకోబడ్డారు. ఫిలిం పరిశ్రమ తాలూకు వివిధ సంఘాల నుండి 45 గురు ప్రతినిధులు సభకు హాజరయ్యారు.

సభలో ప్రసంగిస్తూ వాసన్ గారు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో సినిమాలను అభివృద్ధి చేయడానికి, ముఖ్యంగా గ్రామ ప్రాంతాల్లో అభివృద్ధి చేయడానికి కృషి జరగాలని ఉద్ఘాటించారు.

## ★ బొంబాయి సినిమాలేఖ ★

బిమల్ రాయ్ గారి "దేవదాసు" షూటింగ్ జోరుగా జరుగుతోంది. మోహన్ స్టూడియోస్‌లో వేసిన సెట్సుమీద పని జరుగుతోంది. మార్చి 30 వ తేదీన చైనీస్ ఫిలిం ప్రతినిధివర్గం ఆ స్టూడియోకు రాగా, బిమల్ రాయ్ వారికి ఆతిథ్యం ఇచ్చారు. చైనీస్ ప్రతినిధులు ఫిలిం నిర్మాణంలో కొత్త పద్ధతులను పరిశీలించడానికై ఈపర్యటన చేస్తున్నారు. వారిలో మహాంచెన్ జ్యాశాంగ్ అనే సభ్యురాలు కూడా వున్నది. చైనాలో చిత్రనిర్మాణం బాగా వెనకబడివుందని వారితో చర్చించిన మీదట తేలింది. చైనాలో ఆరు స్టూడియోలున్నాయట. వాటిలో రెండు స్టూడియోలు డాక్యుమెంటరీలను మాత్రమే తయారు చేస్తాయి. ఏడాదికి 20 చిత్రాలు మాత్రమే తయారు చేస్తారు. సినిమా మందిరాలు 800 మాత్రమే ఉన్నాయట.

* * *

"దేవదాసు"గా నటిస్తున్న దిలీప్ కుమార్ తానీ చిత్రంలో గొప్ప నటుడు, అనుభవశాలి అయిన మోతీలాల్‌తో కలిసి నటిస్తున్నందుకు సంతోషిస్తున్నానని చెబుతున్నాడు. పార్వతిగా నటించబోయే సుచిత్రాసేన్ ఈనెలాఖరుకు కలకత్తానుండి బొంబాయి వస్తుందట. ఈచిత్రంలో వేశ్య

ఫిలిం పరిశ్రమపై జరిగిన వ్యతిరేక ప్రచారం ఇప్పుడు దానంతట అదే తగ్గిపోయిందని, ఇది సంతోషించవలసిన విషయమనీ వాసన్‌గారన్నారు. "పరిశ్రమ సమస్యలను అందరికీ నచ్చచెప్పడానికి ఇంకా బాగా కృషి జరగాలి. సినిమాలలో విద్యాబోధన ఉండాలనడం అర్థంలేని వాదం. విజ్ఞానమా, వినోదమా అనే ప్రశ్నకు ఎస్. కె. పాటిల్‌గారు చక్కని సమాధానమిచ్చారు. ఫిలిములు, రేడియోలు వినోదంకోసమేనని పాటిల్‌గారన్నారు. సినిమా అన్నిరకాల మనుష్యుల కోసమూ ఉద్దేశింపబడింది. ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రయోజనంకోసం సినిమాకి వస్తారు."

ఫిలింవ్యాపారానికి ముఖ్యవరోధం వినోదంపన్ను అని, దీనినిగూర్చి, ఇతరములైన పన్నులనుగూర్చి పన్నుల విచారణ సంఘంవారు సరిగా పరిశీలన జరపకపోవడం శోచనీయమని సభవారొక తీర్మానం చేశారు. భారత పాకిస్థాన్ దేశాల మధ్య చిత్రాల దిగుమతి ఎగుమతి నిషేధాలను తొలగించుతూ ఒక తీర్మానం చేశారు. ★

# సినిమా వార్తలు

భారతీయటాకీచిత్రాల రజతోత్సవాన్ని ఈ సంవత్సరం డిసెంబరు మొదటివారంలో దేశమంతటా జరపాలని భారత ఫిలిం ఫెడరేషన్‌వారు తీర్మానించారు.

* * *

విజయా వారు "గుణసుందరి కథ" "మిస్సమ్మ" చిత్రాలను హిందీలో కూడా పునర్నిర్మించనున్నారని తెలుస్తున్నది.

* * *

నాగేశ్వరరావు, జానకి, రేలంగి మున్నగువారు నటించే సారథి చిత్రం "రోజులు మారాయి" ఈ నెలలోనే విడుదల కాగలదని తెలుస్తున్నది.

* * *

అన్నపూర్ణావారి "దొంగరాముడు" దాదాపు అయిపోయిందనీ, త్వరలో విడుదల అవుతుందని తెలుస్తున్నది. ★

# "తెనాలి రామకృష్ణ" తారాగణం

చక్కని కరుణరసచిత్రం, అందరిమన్నలను పొందినచిత్రం 'మా గోపి' నిర్మించిన విక్రమ్‌ప్రొడక్షన్స్ ఈసారి 'తెనాలి రామకృష్ణ' నిర్మించెదరని ప్రకటించారు. ఇది హాస్యచిత్రంగా తయారుకాకుండా చక్కని కళాత్మక చిత్రం అనిపించేటట్లు చేయుటకు బి. ఎస్. రంగాగారు కృషి చేయవలెను. దీనిని తెలుగు, తమిళ భాషలలోనేకాక హిందీలో కూడా నిర్మించి ఆంధ్రదేశముయొక్క మణిపూస తెనాలిరామకృష్ణ అని భారత దేశమునకు చాటెదరని ఆశిస్తున్నాను.

పోతే, తెనాలిరామకృష్ణ పాత్రకు ఎ. నాగేశ్వరరావుని ఎన్నుకొనడం ఎంతైనా బాగుంది. ఆపాత్రను అతడుతప్పితే అర్థం చేసుకొని నటించగలవాడు దక్షిణాది నటులలో మరియొకరికి లేదనుట అతిశయోక్తి



సారథి చిత్రం "రోజులు మారాయి"లో ఒక దృశ్యం.



ఉగాదినాడు విక్రమ్ ప్రొడక్షన్సువారు "తెనాలి రామకృష్ణ" మొదలెట్టారు. పూజలు జరిగాయి. ఆర్. బాల సరస్వతి పాడిన పాటను రెండు భాషల్లో రికార్డు చేశారు. నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావు, భానుమతి, జమున, మాస్టర్ వెంకటేశ్వర్...నటిస్తున్నారీ చిత్రంలో. నిర్మాత - దర్శకుడు: బి. యస్. రంగా.

# ★ ప్రేక్షకుల అభిప్రాయాలు ★

## తెనాలిరామకృష్ణ

కాదేమో! మిగతా పాత్రలకుకూడా అగ్రనటీనటులను ఎన్నుకొనినందుకు నా ధన్యవాదాలు.

ఇక తమిళములో రామకృష్ణ పాత్రకు తమిళనటుడు శివాజిగణేశన్‌ను బుక్ చేశారట. నిజమా! నిజమైతే విచారించ వలసిన విషయం. రామకృష్ణుడుఆంధ్రుడు. అతని ముఖవర్చస్సు అందముగా, తేజోవంతముగా ఉంటుంది. తెలుగులో నాగేశ్వరరావుని బుక్ చేసి తమిళములో గణేశన్‌ను బుక్ చేయుటకు కారణము డబ్బురాదనేనా? అలా అంటే నేనునమ్మను. "దేవదాసు"కు తమిళములో డబ్బురాలేదా? పోని నాగేశ్వరరావుకు తమిళమురాదా? అనేక తమిళ చిత్రములలో నటించాడే. ఆలోచించి తమిళములోకూడా నాగేశ్వర రావునేబుక్ చేసి ఆంధ్రులపేరు నిలబెట్టవలెనని కోరుతున్నాను. దీనినే హిందీలోకూడ ఈ నటీనటులతోనే నిర్మించిన బాగుండును. తరువాత దీనిలో సంగీతమునకు ప్రాధాన్యము యివ్వవలెనని మరియొక విజ్ఞప్తి.

జి. చిన్నారావు, విజయవాడ.

## "రేచుక్క"

"రేచుక్క" కథ చాలా బాగుంది. డైరక్షనులో పుల్లయ్యగారుప్రతిభ నంతా చూపారు. అంజలి, రామారావుల నటన అద్వితీయంగా వున్నది. ముక్కామల ఫరవాలేదు. పాటలు బాగున్నాయి. క్రొత్త నటి ప్రమీల చక్కగా నటించింది. నాగారావు, పేకేటిగార్ల హాస్యము చాలా బాగుంది. మంత్రిగా సదాశివరావు రాణించారు. గడచిన రెండేళ్లుగా చిత్రాలు అందిస్తున్న ప్రతిభాసంస్థ, ఈ సంవత్సరము ఉగాదికి ఒక చక్కని జానపద చిత్రాన్ని ఆంధ్రులకు అందించి, వారి మన్ననలను చూరగొన్నది. చిత్రము పామరులకు గూడా అర్థమయ్యేటట్టు తయారుచేయబడ్డది. మొత్తానికి చిత్రము అమోఘంగా విజయం పొందుతుంది.

పోత్తూరి లక్ష్మీనారాయణ
—ఏలూరు.

* * *

సామాన్య ప్రేక్షకునకు వినోదాన్ని అందించుకొరా కేవలం వ్యాపారంకోసం నిర్మించిన చిత్రం 'రేచుక్క.'

కథలోని ప్రతి సన్నివేశం ప్రేక్షకునకు

సులభంగా అర్థమౌతుంది. రాకుమారుడు తన జన్మవృత్తాంతము తెలిసికొని, రాజ్యం కొరకు కోట ప్రవేశించక, ఘోరం సైన్యంతో కథ జరిపించటం ఒక ప్రత్యేకత.

సన్నివేశాలను చిత్రించటంలో దర్శకులు పి. పుల్లయ్యగారు చాల ఓపికతో పనిచేసినట్లు కనిపిస్తుంది. ఒకే పోరాన్ని రెండు మూడు సారులు సంగ్రహించే సన్నివేశాలను యేమాత్రం ప్రేక్షకుడు విసుగు చెందకుండా చాల నేర్పుగా సృష్టించారు. ప్రతి దృశ్యంలోను దర్శకుని పనితనం కనిపిస్తుంది.

సన్నివేశాలకు తగినట్లు మల్లాదివారి సంభాషణలు చాల బాగున్నాయి. కథాగమనంకోసం సంభాషణలు అన్న రీతిలో చాల భావయుక్తంగా ఉన్నాయి. అయితే ఈ ప్రత్యేకత పాటల రచనలో యేమీ కనిపించదు.

పి. యల్. రాయ్ ఫొటోగ్రఫీ ఆహ్లాదకరంగా ఉంది.

నాగా అంజలీదేవి చాల చక్కగా నటించింది. అంజలి, యన్. టి. లు కలిసి నటించిన సన్నివేశాలలోని నటన ప్రేక్షకులకు నూతన ఆనందాన్ని కలిగించింది. క్రొత్తనటి ప్రమీల బాగానే ఉంది. మిగతా నటుల్లో సదాశివరావు నటన చెప్పతగినది. కన్నయ్య చెలికాడు అన్నయ్యగా పేకేటి శివరాం నటన వెకిలిగా ఉంది.

అశ్వత్థామ సంగీతం బాగుంది. జిక్కి పాడిన పాటలలో భావాన్ని కాని, పదజాలాన్ని కాని తెలిసికొనటం చాల కష్టం. ఘంటసాల పాడిన 'ఒంటరొంటరిగ పోయేదాన' పాట బాగుంది.

చిత్రం సాధారణ ప్రేక్షకులకు వినోదాన్ని అందిస్తూ, నిర్మాతల రాబడి వృద్ధి చేస్తుంది.

కరణం మురళీకృష్ణ
—గుంటూరు.

* * *

అంజలీదేవి నటన చిత్రానికి వన్నె తెచ్చింది. రామారావు నటన పాతధోరణిలోనే నడిచింది. నూతననటి ప్రమీల తృప్తికరంగా నటించింది. ముక్కామల, సదాశివరావుల నటన ఉత్తమంగా ఉంది. కథ రచించిన కీ. శే. ఘంటసాల బలరామయ్య అభినందనీయులు. అశ్వత్థామ మ్యూజిక్ చక్కగా ఉంది

ఎం. హెచ్. ప్రసాద్,
—చీరాల.

* * *

మొత్తంమీద ప్రతిభావారు యీజానపద చిత్రమునునిర్మించి తమ పూర్వప్రతిష్ఠను తిరిగి సంపాదించుకొన్నారు. పుల్లయ్యగారి దర్శకత్వం, అశ్వత్థామగారి సంగీతం, పసుమర్తివారినృత్యాలు చిత్రానికిజీవం పోసినాయి. మేకప్ అన్నింటికన్నా అద్భుతంగావుంది. నటీనటులలో అంజలీదేవి, రామారావు చాలాబాగా నటించారు. ఎ. నాగేశ్వరరావు ఉన్నది కొంచెం సేపైనా ప్రేక్షకులకు చాలా సంతోషంగా వుంది. పాటలు మాటలు చాలాబాగున్నాయి. కాని యీ చిత్రంలో ముఖ్యంగా గమనింపవలసినది మహారాజుకుగాని తరువాత రాజుకుగాని అతనివద్ద వున్న మంత్రికిగాని భార్యలులేరు. ఎక్కడాలేని సంప్రదాయం మహారాజు పిల్లలతో సేవకుల పిల్లలవివాహమునకు పోటీ పడటం ఆశ్చర్యంగావుంది. మొత్తం కథ అంతా యీ విషయంమీదనే నడిచింది, విజ్ఞానదృష్టితో కాకపోయినా ఆర్థికంగా యీ చిత్రంవిజయమును పొందవచ్చును.

వద్రి శ్రీరామచంద్రావధాని,
—తాడేపల్లిగూడెం.

★

# "బంగారు పాప"

వాహినీవారి "బంగారు పాప" చాలా బాగుంది. బి. ఎన్. రెడ్డిగారి దర్శకత్వం ముఖ్యంగా చెప్పతగినవిషయం. కోటయ్యగా రంగారావు నటనానైపుణ్యము చిత్రానికి విశిష్టత చేకూర్చిందని చెప్పవచ్చు. కోటయ్య పల్లెటూరి మాటలు నవ్వు పుట్టి



"సాక్షి" చిత్రంలో షీలారామాని.

## "బంగారుపాప"

స్తాయి. మనోహర్‌గా జగ్గయ్య రాణించి ముందంజ వేశాడనే చెప్పాలి. రామశర్మ, కృష్ణకుమారి, జమున బాగా నటించారు. పద్మరాజుగారి మాటలు బాగానే ఉన్నాయి కృష్ణశాస్త్రిగారి పాటలు, అడ్డేపల్లివారి మ్యూజిక్ అంతగా ప్రజలను ఆకర్షించినట్లు కనిపించదు. కోటయ్య ప్రాసను చేష్టలు తెల్పుటకు ఏర్పరచిన హరికథలో నికొంతభాగమును తగ్గిస్తే బాగుండునేమో అనిపిస్తుంది. మొత్తంమీద చిత్రం చాలా బాగుంది.

ఎస్. సీతారామరాజు
—కాకినాడ

* * *

చిత్రానికంతకీ మూలాధారమైన కోటయ్య పాత్రను యస్. వి. రంగారావు గారు అమోఘంగా నటించి ప్రేక్షకుల అభినందన లందుకొన్నారనుటలో సందేహము ... గా కృష్ణకుమారి, మనోహర్‌గా జగ్గయ్య, శేఖర్‌గా రామశర్మ, జమిందారుగా డాక్టర్ శివరామకృష్ణయ్య, శాంతగా జమున, పార్వతిగా విద్య, తదితరులు బాగానే నటించారు. కృష్ణశాస్త్రిగారి పాటలు అంత రసవత్తరముగా లేవు. ఇక పాలగుమ్మి పద్మరాజు గారి మాటలు ఒకమాదిరిగా వున్నాయి.

ఈ చిత్రానికి దర్శకత్వము వహించిన శ్రీ బి. యన్. రెడ్డిగారు చిత్ర విజయానికి చాలా తోడ్పడ్డారని చెప్పకతప్పదు. ఇక సంగీతము చెప్పుకోదగినంతగా లేదు. చిత్రం మొత్తంమీద ఒకటి, రెండు పాటలు మాత్రము బాగున్నాయి. ఫొటోగ్రఫీ మాత్రము చాలా బాగున్నది. అవుట్‌డోర్ దృశ్యాలు చాలా మనోహరముగా వున్నాయి.

జె. వి. వి. నరసింహారాజు
—భీమవరం.

* * *

కోటయ్య పాత్ర ధరించిన యస్. వి. రంగారావు అమాయక యువకుడుగా, త్రాగుబోతు రౌడీగా, పసిపాప దొరికిన తరువాత ప్రేమమూర్తియైన పరమ సాత్వికుడుగా చివరకు త్యాగశీలుడైన వృద్ధుడుగా చూపిన నటనా కౌశలము అద్వితీయము. కోటయ్యను యింటిగ వాల్చిన పసిపాప కన్నతండ్రి మనోహర్‌గా జగ్గయ్య నటన లోని హుందా ప్రజల్ని ముగ్ధులను జేసింది. జగ్గయ్య నటన అన్ని చిత్రాలలోకంటే యీ చిత్రములో అద్భుతముగా నున్నది. కన్నతల్లి కరువై, కన్నతండ్రికి కానిదైన ఒక అనాథ బాలికగా, కోటయ్య కరుకుగుండెను కరుణతో నింపిన బంగారుపాపగా కృష్ణకుమారి అమోఘముగ నటించినది. పాటలు అంత బాగా లేవు. కొండారెడ్డి ఛాయాగ్రహణము, పద్మరాజుగారి కథ, రెడ్డిగారి దర్శకత్వము యీ చిత్రానికి వన్నె తెచ్చినవి. అద్దేపల్లి అండ్ ఓగిరాల గారి సంగీతం కర్ణరసాయనంగా వుంది. వాహినీవారు అభినందనీయులు.

సూర్యదేవర నాగేశ్వరరావు
—తెనాలి.



బ్రిటిష్ తార పర్లీ లారిమర్.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras.



కన్యాదానము

(హిమవంతుడు గౌరిని శివునకిచ్చుట మధురమీనాక్షీ శిల్పమూర్తి)

చిత్రకారుడు: వెల్లటూరి పూర్ణానందశర్మ.

